Photo by P. V. Subramaniam



బహుమతి
పొందిన వ్యాఖ్య

గూడు లేని జోడు

పంపినవారు:
ఎస్. భానుమూర్తి - మదరాసు. 17

# ఉమా గోల్డు కవరింగు వర్క్సు

హెడ్ ఆఫీసు: ఉమా మహలు :: మచిలీపట్టణము



















"ఉమా" బొత్తాము ధర రు. 0-85

"ఉమా" కమ్మలు జత ధర రు. 2-25

"ఉమా" వయిరు కటింగు గాజులు జత 2-4 సైజు ధర రు. 11-50

"ఉమా" బాల్సు గాజులు 2-4 సైజు జత ధర రు. 18-00

"ఉమా" వెడ్డింగు నెక్‌లేసు ధర రు. 20-00 ★ సాధారణ వి. పి. పార్సెలు చార్జీ రు. 1-37

మేము తయారుచేయు అసలు బంగారు కవరింగు "ఉమా" బ్రాండ్ నగలు అనేక సంవత్సరములు మన్నిక యుండి తృప్తిపరచును. ఎప్పుడున్ను, అన్ని శుభకార్యములకున్ను ఉపయోగించవచ్చును. మాయొక్క బ్రాంచీలయందుగాని, హెడ్డాఫీసునందుగాని లభించును.

బ్రాంచీలు:

90, చైనాబజారు రోడ్డు, మద్రాసు - 1. ★ 581, శివాలయం వీధి, విజయవాడ.

* ఆర్డర్లకు, ఉత్తర ప్రత్యుత్తరాలకు, క్యాటలాగుకు హెడ్డాఫీసుకు మాత్రమే.

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక :

చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



# "ఇంటి వైద్యం"





భర్త ఇలా చెప్పుచున్నాడు

నేను ఆఫీసుకు బైలుదేరాక, కొద్ది నిమిషాల్లోనే తిరిగి వచ్చాను, నాభార్య ఆదుర్దాపడింది, నేను పర్సు గాని, పెన్‌గాని మరచిపోయానా లేక అకస్మాత్తుగా జబ్బు చేసిందా...?

"జబ్బా ? నాకు గాదు, నా షర్టుకు." అన్నాను నా షర్టు వీపు చూపిస్తూ, వాళ్లు తూచే మెషీన్‌లోపలె పది నయా పైసల బిళ్ల పడేంత చిరుగుంది. ఇతర షర్టుల కాలర్లు చిరిగాయని దీన్ని యెన్నుకున్నా ఆ చిరుగు చూడకుండా, కాని బస్సు స్టాండువద్ద నా మిత్రుడు పట్టేశాడు."

ఒక నిమిషంలో కుట్టేస్తా, కొంచెమాలస్యమైనా మీరు ఆఫీసుకు వెళ్లొచ్చు!" అంటూ సూది దారం కోసం వెళ్ల బోయిందావిడ.

"ఎందు కాయవస్థ, నా మిత్రునిద్వారా జబ్బు చీటీ పంపేసులే, మన కివ్వాళ హాయిగా సెలవు!" అన్నాను. ఇది సుఖదినమా ? నా మంచి షర్టులన్నీ మాసిపోయి చాకలి మూటలో వున్నాయి. కులాసాగా పార్కుకైనా, సముద్ర తీరానికైనా లేక మేటనీకైనా వెళ్లలేనుగదా, ఇంక పడకే పరమావధి నాకు ! కళ్లు మూయబోతున్నా, తలుపువద్ద స్త్రీ కంఠధ్వని వినిపించింది." మీ వారికేం జబ్బు ?" అది డాక్టర్ కమల స్వరం. "ఏంలేదు, కొంచెం సుస్తీ", అన్నది మా యావిడ. నేను కంగారు పడ్డాను.

ఆమే నా స్థితిని కనుక్కోవాలని ముందుకొస్తే నాభయం ఎక్కువైంది. ఇలా గొణిగాను, "నాకేం జబ్బా? నాకు కాదు గాని నా షర్టుకు ...!" ఆమె చిరునవ్వును బట్టి ఆమె స్టెతస్కోప్ కూడా ఏదో రహస్యాన్ని తెలిపిందనుకోవచ్చు. ఎలాగో మా యావిడ ఆమెను పక్కగదిలోకి గొనిపోయింది.

ఇదే ఆలోచనతో కునుకు పోయాను. పొగలెగ్గే కాఫీ కప్పుతో మా యావిడ వచ్చి నిద్రలేపగానే గడియారం నాలుగు కొట్టింది.

కాఫీ పీలుస్తూ బల్లపైన పేర్చిన ఉతికిన బట్టల దొంతర చూస్తే కళ్లు మిరుమిట్లు గొలిపాయి.

"ఉతికిన బట్టలు వచ్చాయా ?" అన్నాను.

"ఎలా వున్నాయి ? మెరుస్తున్నాయికదూ ! నా చేతులారా నేనే ఉతికాను" అందావిడ.

అన్ని ఎక్కువ బట్టలా ? అంత తెల్లగానా ? దండాలు కొట్టకుమరీ ! నువ్వుతికే శబ్దం వినపడనంత గాఢ నిద్ర పోలేదు నేను !" అన్నాను; "కాని, ఆవిడవిషయమంతా చెప్పగానే ఆశ్చర్య పడ్డాను !"

## భార్య చెప్పుచున్నది



"కమలను అద్భుతంగా మెచ్చుకున్నాను ! ఆమె మానవులకే గాక బట్టలకూ చికిత్సకురాలనిపించింది.



ఆమె బట్టలగురించి, 'నలుగుడు, చిరుగులు, బొత్తాల విరుపులు, ఇంకా ఎన్నో చెప్పుతుంటే ఆనంద పరవశురాలనయ్యాను'', ఇలా అన్నది: "నీ భర్త అన్నట్లు బట్టల ఆరోగ్యంగురించిన్నీ శ్రద్ధవహించాలి. ఎన్నాళ్లో మురికి బట్టలను ఇంట్లోపడేసివుంచి మనకు కనిపించనిచోట ఉతుకులకు పంపెయ్య గూడదు. శుద్ధమైన మంచి సబ్బుతో ఇంట్లో మనం ఉతుక్కోవటంతో మరేదీ సాటిలేదు."

"ఇది మంచి మాటే ! కాని ఇంట్లో ఉతుక్కుంటే ఇప్పుడు మీరు ధరించిన చీరంత మెరిసే తెల్లగావుంటుందంటారా ?'' అన్నాను. నా మాట నమ్ము. మా బట్టలన్నిటి లాగే ఈ చీరెను ఇంట్లో నేనే ఉతికాను.'' అని చిరునవ్వుతో జవాబిచ్చింది. "అంతట నన్నామె తనయింటికి తీసుకు వెళ్లింది. అక్కడ ఉతికి ఆరవేసిన మెరిసే బట్టలు కళ్లారా చూశాను !"

"ఎలాగైనా సన్‌లైట్ ధర గురించి ఆలోచిస్తే... '' అంటూంటే ఆమె అందుకున్నది; ''తరుచు బట్టలు చిరిగిపోయి, తరచు కొత్తవి కొనుక్కొనే ఖర్చు ఆలోచిస్తేనో, మరి సన్‌లైట్‌తో ఆభయం లేదు. బట్టలన్నిటినీ బాదక్కర్లేకుండా చక్కగా ఉతుక్కో గలిగేంత సమృద్ధయిన గుణవంతమగు నురగను గలిగిస్తుంది. అంటే బట్టలు చాలాకాలం మన్నుతాయి. పైగా, కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను తెల్లగాను, కాంతిగాను ఉతుకుతుంది. నీవు తరుచు సబ్బు కొనక్కర్లేదు. ఆలా, రెండు విధాలా ఆదాయం; కాదూ ? "

''నే నింటికొస్తూ ఒక సన్‌లైట్ బిళ్ల కొనుక్కొచ్చి ఈ బట్టలన్నీ ఉతుకులకు వాడేను. ఇది నిజంగా డాక్టరు సంహాను ఋజువు పర్చింది!'' అన్నాను మా ఆయనతో. మెరుస్తూన్న ఆ తెల్లని బట్టలదొంతర ఆశ్చర్యంగా చాలాసేపు చూశాక, ఆయన ఆకస్మాత్తుగా ఉత్సాహపడి "ఈ రాత్రిమనం సినిమాకి వెళ్లుదాం, తయారైయుండు, ప్రేయసీ!" అన్నారు.




S/P.4B-50 TL

బొంబాయిలోని హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి

# మీరు ఆశ్చర్యపోతారు!



పిల్లలు మొట్టమొదట ప్రేమించేది పరాగ్ అని వేరే ఋజువు పరచనక్కర్లేదు. మీ అంతట మీకే తెలుస్తుంది. వారికి ఒక పరాగ్ కాపీనిచ్చి వారి మనస్సును దానినుండి మరల్చగలరేమో చూడండి. మీరు సినిమాకి వెళ్తున్నా సరే మీ పిల్లలు మీకు ఆనందంతో "బై బై" చెపుతారు.

పరాగ్‌లో—మనోహరమగు కథలు, మీ పిల్లలకు వినోదము, విజ్ఞానము చేకూర్చు గీతములు, కడుపుబ్బ నవ్వించే కార్టూనులు, మైమరపించే కథలు, పొడుపు కథలు, పోటీలు, ఏకాంకిక నాటికలు, ఆటలు, విజ్ఞాన శాస్త్రము, ఆకర్షణీయమగు రంగులలో బొమ్మలు-నిజానికి మీ బిడ్డ ఏమి చదవాలని మీ కుంటుందో అవన్నీ.యిందులో వున్నాయి.



"టైమ్స్ ఆఫ్ ఇండియా" లేక "ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా" ఏజంట్లవద్ద. లేక ఇతర పేరొందిన న్యూస్ ఏజంట్లవద్దగాని. బుక్‌స్టాల్స్ వద్దగాని. లేక టైమ్స్ ఆఫ్ ఇండియా. బొంబాయినుండి లేదా 10. దార్యగంజ్. ఢిల్లీ. 13/1 & 13/2 గవర్నమెంట్ ప్లేస్. ఈస్ట్. కలకత్తా మరియు ఆల్‌బెమర్లే స్ట్రీట్. లండన్. డబ్ల్యు-1 వద్దనుండిగాని దీనిని పొందవచ్చును.



# పరాగ్

టైమ్స్ ఆఫ్ ఇండియావారి ప్రచురితము




ఎక్కడ లైఫ్‌బాయ్ ఉన్నదో
అక్కడ ఆరోగ్యము వున్నది!

ఆహా, లైఫ్‌బాయ్‌తో స్నానం, ఆనందదాయకం! దాని హాయిగొలిపే అనుభవాన్ని ... పులకింపజేసే ఆరోగ్యకర స్పర్శను మీరు ఇష్టపడతారు! ఆటలోనైనా, పనిలోనైనా మురికి అంటకుండా ఎవరూ తప్పించుకోలేరు. లైఫ్‌బాయ్‌యొక్క సమృద్ధయిన నురగ మురికిలోని క్రిములను కరిగివేసి మీ ఆరోగ్యాన్ని కాపాడుతుంది. మీ కుటుంబములో అందరూ నేటినుంచి లైఫ్‌బాయ్‌ని వాడుట మంచిది కాదా?

L. 16-X29 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

ఆధునిక యంత్ర
పరికరములతోను
సాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ






ఆఫ్‌సెట్టు ప్రింటర్సు

## ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు-26

ప్రతినిధి కార్యాలయాలు:

ప్లాట్ నెం. 101, ఫస్టు ఫ్లోర్ పుష్పజ కుంజ్ 16-ఎ, రోడ్డ్, చర్చిగేట్, బొంబాయి-1.

డి/11, 5 మెయిన్ రోడ్, గాంధినగర్, బెంగళూరు-9. (ఫోన్: 6555)

మనోహరమైన పరిమళమునకు!






మాలిని

రెమి సౌందర్య పరికరాలు

Aykan




జె. బి. మంఘూరామ్ వారి




ఎనర్జి
ఫుడ్
బిస్కత్తులు



రేపటి పౌరులకు పుష్టి నిచ్చునవి

**J. B. MANGHARAM & CO.**
GWALIOR




## జె. బి. మంఘూరామ్ అండ్ కో.,
## గ్వాలియర్.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈసంచికలో భాసుడి ఆఖరు నాటక కథ "చారుదత్తుడు" వేస్తున్నాం. ఇది భాసుడి ఆఖరు నాటకం అని చెబుతారు. ఏమంటే ఈ నాటకం పూర్తికాలేదు. అదీగాక ఈ నాటకంలో చెయ్యితిరిగిన నాటక రచయితయొక్క ప్రావీణ్యం కనిపిస్తుంది. పూర్తికాకపోయినప్పటికీ "చారుదత్తుడు" భాసుడి ఉత్తమ నాటకాలలో ఒకటి అనటానికి ఎలాటి సందేహమూ లేదు.

"తెలివైన గుర్రం" అనే కథ అమెరికా దేశపు స్వాతంత్ర్య పోరాటంలో జరిగిన ఒక సంఘటనను చిత్రించే వాస్తవ కథ. ఇక ముందుకూడా ఇలాగే ప్రతి సంచికలోనూ చరిత్రకు సంబంధించిన కథ ఒకటి మీరు చదువుతారు.

గతమాసం ప్రకటించిన "చందమామ జన్మదిన ప్రత్యేక సంచిక" అనుకున్నదానికన్న ఎక్కువగా విజయవంతం అయింది. కాపీలు దొరకని పాఠకులకు మా సానుభూతి.

సంపుటి 27 : ఆగస్టు 1960 : సంచిక 2




అర్జునుడు తనను మర్నాడు సూర్యాస్తమయం లోపుగా చంపేస్తానని ప్రతిజ్ఞ చేసినట్టు తెలియగానే సైంధవుడు వణికి పోయాడు. అతను కౌరవ వీరుల ఎదట ఆక్రోశిస్తూ, "అయ్యలారా, నన్ను కాపాడండి. అర్జునుడి ప్రతిజ్ఞ విని పాండవులు, అభిమన్యుడు చచ్చినందుకు ఏడవటానికి మారుగా, సంతోషంతో శంఖాలు పూరిస్తున్నారట. నన్ను కాపాడటం మీవల్ల కాకపోతే చెప్పండి, నేనిప్పుడే మా యింటికి బయలుదేరుతాను!" అన్నాడు.

"ఇంతమంది వీరులుండగా నిన్ను అర్జునుడు ఎట్లా చంపుతాడు? నువ్వేమీ భయపడకు!" అని దుర్యోధనుడు సైంధవుడికి ధైర్యం చెప్పాడు.

"యుద్ధంలో చచ్చిపోవటం నీ ఉత్తమ ధర్మం. అలాటప్పుడు చావుకు భయపడతావేమిటి? అందరమూ చచ్చేవాళ్లమే. రేపు అర్జునుడు భేదించలేని వ్యూహం పన్నుతున్నాను. నువు ధైర్యంగా ఉండు," అన్నాడు ద్రోణుడు.

అక్కడ పాండవ శిబిరంలో కృష్ణుడు అర్జునుణ్ణి మందలించాడు. "అర్జునా, నీ అన్నదమ్ములతో సంప్రతించకుండా, నాతోనైనా మాటమాత్రం చెప్పకుండా, రేపు అస్తమయం లోపుగా సైంధవుణ్ణి చంపుతానని ఎందుకు ఘోర ప్రమాణం చేశావు? నేను చారులను పంపి కౌరవుల తంత్రం తెలుసుకున్నాను. రేపు యుద్ధంలో సైంధవుడికి కర్ణ కృపాశ్వత్థామలూ, శల్య భూరిశ్రవ వృషసేనులూ రక్షకులుగా ఉంటారట. ఆ ఆరుగురు యోధులనూ ఓడించినప్పుడుగద నీకు సైంధవుడు చిక్కేది?" అన్నాడు కృష్ణుడు.

అర్జునుడు ఉద్రేకంతో, "కృష్ణా, నువు చెప్పిన ఆరుగురికీ కలిసి నాలో సగం పరాక్రమం లేదు. ద్రోణుడు చూస్తుండగానే

అట్టమీది బొమ్మ

ఆ సైంధవుణ్ణి చంపేస్తాను. ఇదుగో, అస్త్రం ముట్టి ప్రమాణం చేస్తున్నాను. దేవతలు రక్షగా నిలిచినా సరే నేను రేపు సైంధవ పాపిని సంహరించి తీరుతాను. దయచేసి నా అస్త్రాలనూ, నా గాండీవాన్నీ తృణీక రించకు!" అన్నాడు.

ఇద్దరూ కొంతసేపు విచారసాగరంలో మునిగిపోయారు. అర్జునుడు కృష్ణుడితో, "నీ చెల్లెలు సుభద్రనూ, మా కోడలు ఉత్త రనూ ఉపాయంగా ఊరడించు," అన్నాడు. కృష్ణుడు వెంటనే అర్జునుడి శిబిరానికి బయలుదేరి వెళ్ళాడు. సుభద్ర దుఃఖం వర్ణనాతీతం. ఆమెను ఊరడించటానికి వచ్చిన ద్రౌపదీ, మిగిలిన స్త్రీజనమూ శోక సాగరంలో మునిగి తేలుతున్నారు. కృష్ణుడు తన చెల్లెలితో, "సుభద్రా, నీవే ఇంతగా ఏడిస్తే, పాపం, ఉత్తరను ఎవరు ఓదార్చు తారు. అభిమన్యుడి కోసం ఎందుకు దుఃఖి స్తావు? వాడు మాకందరికీ మార్గదర్శీ, ఆద ర్శమూ అయినాడు. మేమందరమూ వాడి దారినే వెళ్ళాలనుకుంటున్నాము. వాడి చావుకు కారకుడైన సైంధవుణ్ణి రేపు నీ భర్త చంపి, నీ శోకాగ్ని చల్లార్చుతాడు!" అంటూ సుభద్రకూ, ఉత్తరకూ ఉపశమన వాక్యాలు చెప్పి, ఇంటికి వెళ్ళిపోయాడు.




కృష్ణుడు ఆ రాత్రి చాలాసేపు కన్ను మూయక అర్జునుడి శపథం గురించే ఆలో చించాడు. చివరకు అతను తన సారథి అయిన దారుకుడితో, "చూడు, దారుకా! రేపు అర్జునుడికి బదులుగా నేనే యుద్ధం చేస్తాను. అందుకని నువ్వు ఏంచేస్తావంటే, తెల్లవారుతూనే నా రథం ఆయత్తంచేసి, అందులో నా గదా, కౌమోదకీ, శక్తీ, చక్రమూ, ధనుర్బాణాలూ ఉంచు. గరుడ ధ్వజమూ, గొడుగూ అమర్చు. నువుకూడా కవచం ధరించి రథాన్ని యుద్ధరంగానికి తీసుకురా. అవసరమైనప్పుడు నా పాంచ జన్యాన్ని బలంగా పూరిస్తాను; ఆ చప్పుడు



చెవిని పడగానే రథంతో నేనున్న చోటికి రావాలి," అని హెచ్చరిక చేశాడు.

ఆ రాత్రి అర్జునుడు తన ప్రతిజ్ఞ కాపాడుకునే విషయం గురించి విచారిస్తూ కళ్ళు మూసుకుని ఒక చిత్రమైన కల కన్నాడు. ఆ కలలో ఈ విధంగా జరిగింది:

ఎక్కడినుంచో కృష్ణుడు అర్జునుడి వద్దకు వచ్చాడట. అర్జునుడు అతనికి స్వాగతం చెప్పి కూర్చోమని ఆసనం చూపి, తానుమాత్రం నిలబడే ఉన్నాడట. కృష్ణుడు, "అర్జునా, ఎందుకు విచారిస్తావు? దిగులు పడకు," అన్నాడట. దానికి అర్జునుడు, "దేవా, రేపేగదా సైంధవుణ్ణి చంపాలి? కౌరవ వీరులూ, అపారమైన కౌరవ సేనలూ ఆ సైంధవుణ్ణి చుట్టుముట్టి కాపాడితే అతన్ని చంపటం సాధ్యపడుతుందా?" అన్నాడట.

"మహేశ్వరుడు నీకు పాశుపతాస్త్రం ప్రసాదించాడుగదా. ఆ మహేశ్వరుణ్ణి ధ్యానించు. ఆయన అనుగ్రహంవల్ల నీకది లభిస్తుంది," అన్నాడట కృష్ణుడు. ఆ మాట విని అర్జునుడు నేలపై కూర్చుని శంకరుణ్ణి తదేకంగా ధ్యానం చేశాడట.

అంతలోనే కృష్ణార్జునులిద్దరూ ఆకాశంలో తేలి వెళుతున్నారు. ఉత్తరంగా మంచు కొండలు కనబడ్డాయి. గంగానదీ, ఏవేవో చెట్లూ, ఆశ్రమాలూ, అక్కడక్కడా ఇళ్ళ సమూహాలూ కనబడ్డాయి. చివరకు వారు శివ పార్వతులూ, భూతగణాలూ ఉండే కైలాసాన్ని చేరుకున్నారు. కృష్ణుడూ, అతని తరవాత అర్జునుడూ శివుడికి నమస్కరించారు, స్తుతించారు.

శంకరుడు వారిద్దరినీ ప్రేమతో ఆదరించి, "నర నారాయణులారా, మీరు వచ్చిన పని తెలుసుకున్నాను. ఈ పక్కనే ఒక సరస్సులో నా ధనువునూ, అస్త్రాన్నీ ఉంచాను. వెళ్ళి తెచ్చుకోండి," అన్నాడు. కృష్ణార్జునులు ఆ సరస్సువద్దకు వెళ్ళి లోనికి దిగేసరికి ఒక ఘోరమైన మహాసర్పం సూర్యుడు

లాగా వెలిగిపోతూ వారికంట పడింది. అక్క డనే వెయ్యి శిరస్సులు గల మరొక మహా సర్పంకూడా ఉన్నది; దానినుంచి జ్వాలలు వెలువడుతున్నాయి. ఇద్దరూ నమస్కారాలు చేసి శంకరధ్యానం చేస్తూ ఉండిపోయి నారు. అప్పుడా మహాసర్పాలు తమ పాము ఆకారాలు విసర్జించి, ధనుర్బాణాలుగా వారికి గోచరించాయి.



కృష్ణార్జునులు వాటిని తీసుకుని శివుడి వద్దకు తిరిగి వచ్చారు. అప్పుడు శివుడి పార్శ్వంనుంచి ఒక ఆకారం వెలువడి ఆ ధనువుకు ఆ బాణాన్ని సంధించింది. అర్జునుడు అతి జాగ్రత్తగా ఆ బాణంయొక్క తాటినీ, పట్టుకునే పద్ధతినీ, బాణం ఎక్కు పెట్టే పద్ధతినీ గమనించుతూ, శివుడు పఠించిన మంత్రాన్ని ఆలకించి తన మనసులో మననం చేసుకున్నాడు.

తరవాత కృష్ణార్జునులు ఆ ధనుర్బాణాలను తిరిగి సరస్సులో ఉంచి, శివుడివద్ద సెలవు పుచ్చుకుని తిరిగివచ్చారు.

ఈ కల పూర్తి అయేలోపుగా అర్జునుడి మనస్సులో ఒక గొప్ప సంతృప్తి, ఘనకార్యం సాధించానన్న ఆనందమూ కలిగింది.

ఆ రాత్రి గడిచినదాకా కృష్ణుడు దారుకుడితో మాట్లాడుతూనే ఉండిపోయి, తెల్లవారగానే ధర్మరాజు శిబిరానికి వెళ్లాడు. ఆ సమయానికి రాజముఖ్యులందరూ ధర్మరాజును చూడవచ్చారు. ధర్మరాజు కృష్ణుడితో, "ఈరోజు అర్జునుడి శపథం పూర్తి అయేటట్టు చూసే భారం నీదే!" అన్నాడు. "ధర్మరాజా, ఆ విషయమై నీవు శాంతంగా ఉండు. ఇవాళలోగా ఆ సైంధవ పాపిశవం నక్కలపాతా, గద్దలపాతా పడటం నిశ్చయం," అన్నాడు కృష్ణుడు. ఇంతలో అర్జునుడు అక్కడికి వచ్చి అందరికీ నమస్కరించి, ధర్మరాజుతో తనకు రాత్రి వచ్చిన కల గురించి చెప్పాడు. అందరూ ఆశ్చర్యానందాలు పొందారు.



తరవాత అందరూ యుద్ధ ప్రయత్నాలకు ఉపక్రమించారు. అర్జునుడు సాత్యకితో, "సాత్యకీ, ఈరోజు మన ధర్మరాజును వెంటఉండి కాపాడే భారం నీమీద వేస్తున్నాను. నీలో నాకుండే విశ్వాసం మరెవరిలోనూ లేదు. ఇక సైంధవుణ్ణి చంపటం మాటా? ఆ పని నేను ఒక్కణ్ణే చేస్తాను. నాకు ఎవరి సహాయమూ అవసరం లేదు," అన్నాడు.

అనాటి యుద్ధానికి ద్రోణుడు తన సేనను శకటవ్యూహంలో అమర్చాడు. ఆయన సైంధవుణ్ణి కాపాడేటందుకు భూరిశ్రవుణ్ణీ, కర్ణుణ్ణీ, అశ్వత్థామనూ, శల్యుణ్ణీ, వృషసేనుణ్ణీ, కృపుణ్ణీ నియోగించాడు. ఈ యోధులందరినీ చుట్టుముట్టి రక్షించేటందుకు ఒకలక్ష గుర్రాలనూ, అరవైవేల రథికులనూ, పధ్నాలుగువేల ఏనుగులనూ, ఇరవైఒక్క వేలమంది కవచధారులైన కాల్బంటులనూ ఏర్పాటుచేశాడు. ఇలా చేసి ద్రోణుడు సైంధవుడితో, "నువు నాకు ఆరు కోసులు వెనకగా ఉండు. నీకేమీ భయం కలగదు. నిన్ను పాండవులు కారుగదా, దేవతలతో కూడిన ఇంద్రుడుకూడా ఏమీ చెయ్యలేడు!" అని చెప్పాడు.

అవతల పాండవ సేనలను నకులుడి కొడుకైన శతానీకుడూ, ధృష్టద్యుమ్నుడూ కలిసి ఒక వ్యూహంగా అమర్చారు. అర్జునుడు తన ప్రతిజ్ఞ పూర్తిచేసే ఉత్సాహంతో కాలాగ్నిలాగా ప్రజ్వలించుతూ కౌరవసేనల పైన వచ్చి పడ్డాడు. అతను శకట వ్యూహాన్ని చేరేలోపుగా ధృతరాష్ట్రుడి కొడుకులలో ఒకడైన దుర్మర్షణుడు ఏనుగుల సేనతో అడ్డు పడ్డాడు. అర్జునుడా సేనను చించి చెండాడి చెదరగొట్టేశాడు. తరవాత దుశ్శాసనుడు మరొక సేనతోసహా అర్జునుణ్ణి ఎదిరించాడు. ఆ సేనగతి అంతే అయింది. దుశ్శాసనుడు బెదిరి తన మిగిలిన సేనతో శకటవ్యూహం ప్రవేశించి ద్రోణుడి చాటున దాగాడు.

అర్జునుడు ద్రోణుణ్ణి సమీపించి వినయంగా నమస్కారం చేసి, "గురుదేవా! సైంధవుణ్ణి చంపుతానని ప్రతిజ్ఞచేశాను. ఆ ప్రతిజ్ఞ నెరవేరేటట్టు అనుగ్రహించండి!" అన్నాడు.

"నన్ను జయించకుండా సైంధవుడి దగ్గిరికి నువు వెళ్ళలేవే!" అన్నాడు ద్రోణుడు. ఇద్దరూ యుద్ధం ఆరంభించారు. అర్జునుడి ప్రతాపం ద్రోణుడిముందు ఏమాత్రమూ పారకపోగా, రోజల్లా యుద్ధం చేసినా అర్జునుడు ముందుకు ఒక్క అడుగు వేసే అవకాశం కనిపించలేదు. కృష్ణుడిది గమనించి, "అర్జునా, ఇక్కడే కాలమంతా వ్యర్థమవుతున్నది. ఈ ద్రోణుణ్ణి తప్పించుకుని మనం ముందుకు పోవాలి!" అంటూ రథాన్ని పక్కకు తిప్పి ముందుకు తోల సాగాడు. ద్రోణుడు అర్జునుడి వెంట తగిలి, "అర్జునా, నేను యుద్ధం చేస్తుండగానే ఎక్కడికి అలా పోతున్నావు?" అన్నాడు.

"అయ్యా, మీ శిష్యుణ్ణి, మీ కొడుకు లాటివాణ్ణి. మిమ్మల్ని జయించటం నా వల్ల అవుతుందా?" అన్నాడు అర్జునుడు వేగంగా ముందుకు సాగిపోతూ.

అర్జునుడి రథం త్వరలోనే సైంధవుడి సేనను చేరుకున్నది. అర్జునుడికి చక్ర రక్షకులుగా యుధామన్యుడూ, ఉత్త



మౌజుడూ మాత్రమే వెంట ఉన్నారు. ఇలా మీదికి వచ్చే అర్జునుణ్ణి అడ్డగించటానికి కృతవర్మ, జయుడూ, కాంభోజుడూ, శ్రుతాయువూ పెద్దసేనతో ఎదుర్కొన్నారు. ఘోరంగా యుద్ధం సాగింది. కృష్ణార్జును లిద్దరూ బాగా గాయపడ్డారు. అర్జునుడికి ఇంకొక నష్టం ఏం జరిగిందంటే కృపుడు అర్జునుడి చక్రరక్షకులిద్దరినీ నిలవేసి ముందుకు పోకుండా చేశాడు. అందుచేత అర్జునుడి రథం ఒంటిగా శత్రుసైన్యం ప్రవేశించింది.

అయినా అర్జునుడు ఆరోజు చేసిన సైన్య క్షయానికి అంతులేదు. ఎందరో యోధులు అతని చేతిలో చచ్చారు. కాంభోజరాజు కొడుకు సుదక్షిణుడూ, శ్రుతాయుధుడనే అజేయుడైన వీరుడూ చచ్చారు. ఈ శ్రుతాయుధుడు వరుణదేవుడికీ పర్ణాశ అనే నదికీ పుట్టినవాడు. వరుణుడు వాడికొక అప్రతిహతమైన గద ఇచ్చాడు. ఆ గద మూలంగా వాడు సాటిలేని వీరుడై, ఎవరికీ ఓడకుండా జయించుకువచ్చాడు. అయితే వరుణుడు వాడికొక్క హెచ్చరిక చేశాడు. "ఈ గదను యుద్ధం చెయ్యనివాడిపై ప్రయోగించావో, అది నీ తలనే పగలగొట్టుతుంది!" అన్నాడు. శ్రుతాయుధుడు ఈ సంగతి మరిచిపోయి ఈరోజు తన గదను కృష్ణుడిపై విసిరాడు, మరుక్షణమే అది తలపై పడి వాడు చచ్చిపోవటం జరిగింది.

తరవాత శ్రుతాయువూ, అచ్యుతాయువూ అనేవాళ్ళు అర్జునుడితో వీరోచితంగా పోరాడి చచ్చారు. వారి కొడుకులు నియుతాయువూ, దీర్ఘాయువూ అనేవాళ్ళు తనపైకి రాగా అర్జునుడు వారిని తృటిలో యమలోకానికి పంపేశాడు. అదేవిధంగా అంబష్ఠుడనేవాడు కూడా అర్జునుడి చేతిలో చచ్చాడు. అర్జునుడు ఆనాడు సైంధవుణ్ణి చంపి తన ప్రతిజ్ఞ నెరవేర్చుకునే ప్రయత్నంలో కౌరవసైన్యంపైన కావించిన చిత్రవధ వర్ణనాతీతమైనది.






## 8

[అమరపాలుడి నాయకత్వాన వెళ్లిన సైనికులు భయంకర పక్షుల్ని నిలువునా దహించారు. తరవాత రాకుమార్తె కాంతిమతిని, పులిరాయుళ్లు మేనా ఎక్కించి ఎక్కడికో తీసుకుపోతున్నట్టు వార్త వచ్చింది. చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ సైనికులతో వెళ్ళి, మేనాను అడ్డగించారు. పులిరాయుళ్ల నాయకుడు, రాజకుమార్తెను చంపమని ఆజ్ఞ యిచ్చాడు. తరవాత—]

పులిరాయుళ్ళ నాయకుడు, తన అనుచరులకు చేసిన హెచ్చరిక వింటూనే, ఒక వైపు నుంచి చిత్రసేనుడూ, రెండవ వైపునుంచి ఉగ్రాక్షుడూ అతడి సేవకులూ వాళ్ళమీద పడ్డారు. చూస్తూంఉగానే పులిరాయుళ్ళు రాక్షసుల రాతి గదలకూ, చిత్రసేనుడి అనుచరుల కత్తి దెబ్బలకూ నేల కొరగసాగారు. ఇక విజయావకాశం ఏమాత్రం లేదని గ్రహించిన పులిరాయుళ్ల నాయకుడు, ఎక్కడ లేని తెగింపుతో ఒక చేత్తో కత్తినీ, రెండవ చేత్తో ఈటెనూ పట్టుకుని భయంకరంగా పోరాడుతూ, "మన అంతం సమీపించింది. ముందు కాంతిమతిని చంపండి!" అంటూ కేకలు పెట్టాడు.

ఆ కేకలు వింటూనే చిత్రసేనుడు నివ్వెరపోయాడు. రాజకుమార్తె ఈ దుర్మార్గుల చేతిలో తప్పక మరణించగలదని అతడు భావించాడు. తనకూ రాజకుమార్తె వున్న మేనాకూ మధ్య దాదాపు పదిమంది శత్రువులు అన్నిటికీ తెగించి పోరాడు



తున్నారు. వీళ్లను చంపిగాని తను మేనాను సమీపించలేడు.

చిత్రసేనుడు మహోద్రేకంతో కత్తిని ఎదురుగా వున్న శత్రువులమీదికి విసురుతూ, తనను పక్కలనుంచి ఎదుర్కొంటున్న శత్రువుల మాటే మరిచి, సూటిగా మేనాకేసి వెళ్లసాగాడు. అంతలో మేనా తలుపులు ఫెళ్లుమంటూ తెరుచుకున్నవి. కాంతిమతి మెరుపులా మేనానుంచి కిందికి దూకి, దాపుల చచ్చి పడివున్న శత్రుసైనికుడి కత్తి ఒకటి తీసుకుని, మేనా పక్కకు వస్తున్న పులిరాయుళ్లను ఎదుర్కొన్నది. ఇది చూసిన ఉగ్రాక్షుడు అడవి దద్దరిల్లేలా రంకె



వేసి "ఇదుగో, వస్తున్నాను, కాంతిమతీ! క్షత్రియకన్య వనిపించుకున్నావు!" అంటూ గడతో తనకు అడ్డువచ్చిన పులిరాయుళ్లను బంతులను కొట్టినట్టు గాలిలోకి ఎగరకొడుతూ మేనాను సమీపించాడు. ఈలోపల చిత్రసేనుడుకూడా మేనాను సమీపించాడు. వాళ్లకు రక్తం ఓడుతున్న కత్తి పట్టుకు నిలబడివున్న కాంతిమతి కంట బడింది.

"ఈయన చిత్రసేన మహారాజు. నేను ఉగ్రాక్షుణ్ణి! ఈ అడవి అంతా నాదే!" అన్నాడు ఉగ్రాక్షుడు, కాంతిమతితో.

కాంతిమతి, ఉగ్రాక్షుడికేసి కోపంగా చూసి, చిత్రసేనుడి వైపుకు తలయినా తిప్పకుండా గిరున వెనుదిరిగి, మేనాలో ఎక్కి కూర్చున్నది.

రాజకుమారి కాంతిమతి ప్రవర్తన చిత్రసేనుడికి ఆగ్రహం కలిగించింది. తను ప్రాణాలకు తెగించి పులిరాయుళ్ళతో పోరాడి, ఆమెను కాపాడాడు. అయినా, రాజకుమారి తనకు కృతజ్ఞత చెప్పకపోగా, ఈసడించినట్టు తనకేసి చూడటం అతడికి పెద్ద అవమానంగా తోచింది.

"ఉగ్రాక్షా, ఇక్కడ మన పని ముగిసింది. ఇక మనం సైన్యాలతో ధవళగిరికేసి బయలుదేరటం మంచిది," అన్నాడు చిత్రసేనుడు.





చిత్రసేనుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు అదిరిపడ్డాడు. తాము ముందు అనుకున్న పథకం ప్రకారం, అంతా కలిసి కపిలపురం కోటను ముట్టడించవలసి వున్నది. ఆ పనిమీద అంతకుముందే కొద్దిసైన్యంతో అమరపాలుడు వెళ్ళాడు. కపిలపురం కోటను వశపరుచుకుని, ఆ తరవాత రాజద్రోహి నాగవర్మను హతమార్చాలని లోగడ నిర్ణయం జరిగింది. కాని, ఇప్పుడు చిత్రసేనుడి ధోరణి చూస్తూంటే మరోలా వున్నది.

"చిత్రసేనా, మనం ముందుగా కపిలపురం కోటను వశపరుచుకోదలిచాంగదా? అదృష్టవశాత్తూ, మార్గమధ్యంలో రాకుమారిని కాపాడాం," అన్నాడు ఉగ్రాక్షుడు తడబడుతూ.

"మనం రాకుమారిని కాపాడామా? ఊహుఁ, ఆవిడే మనను రక్షించినట్టుగా ప్రవర్తిస్తున్నది. జ్వాలాద్వీపవాసులతో చేతులు కలిపిన నాగవర్మ, వీరసింహ మహారాజును బందీని చేసి జ్వాలాద్వీపం పంపినట్టు అమరపాలుడు లోగడే చెప్పాడు. అటువంటి పరిస్థితుల్లో, మనం యుద్ధంచేసి కపిలపురాన్ని వశపరుచుకుని ఎవరికి రాజరికం కట్టబెట్టగలం?" అన్నాడు చిత్రసేనుడు కోపంగా.



చిత్రసేనుడు మాటలు ముగించేలోపలే, కాంతిమతి మేనాలోనుంచి బయటికి వచ్చింది. ఆమె చిత్రసేనుడికేసి అనుమానంగా చూస్తూ, "నా తండ్రిగారిని ద్రోహి నాగవర్మ జ్వాలాద్వీపం పంపినట్టు మీతో చెప్పిన ఆ అమరపాలుడు ఎవరు?" అని ప్రశ్నించింది.

"అతడు కపిలపురంవాడే. నాగవర్మ సైన్యంలో చేరి, మాకు బందీగా చిక్కి, తరవాత కొన్ని రహస్యాలు చెప్పి, మాకు సహాయపడ్డాడు," అన్నాడు చిత్రసేనుడు.

"ఆ అమరపాలుడు చెప్పింది అబద్ధం. బహుశా, అతడికి నిజం తెలిసివుండదు.






నా తండ్రిగారు కోటలోనే ఏదో భూగృహంలో బంధించబడివున్నారు," అన్నది కాంతిమతి.

"అలాగా!" అన్నాడు చిత్రసేనుడు.

"మనం ఆయన్ని రక్షిద్దాం, చిత్రసేనా!" అన్నాడు ఉగ్రాక్షుడు ఆత్రంగా.

"పిలవని పేరంటం మనకెందుకు? మన నుంచి అలాటి సహాయం కావాలని ఎవరు కోరారు?" అంటూ చిత్రసేనుడు ఉగ్రాక్షుడి మీద కస్సుమన్నాడు.

"సహాయం చేయవలసిందని నేను కోరుతున్నాను," అన్నది కాంతిమతి.

"ఇంతకుముందు మీ ప్రవర్తన మరో విధంగా వున్నది. నన్ను మీ సామంతరాజు కన్న కూడా హీనంగా చూశారు. బహుశా నన్నుగురించి మీకేమీ తెలియదేమో. ఇప్పుడు మీరున్న ఈ అడవిప్రాంతం అంతా నాది. ఇక్కడికి దాపులనే వున్న అపూర్వ భవనం, దానికి అనుకునివున్న నగరం—నా రాజధాని," అన్నాడు చిత్రసేనుడు గాంభీర్యం వుట్టిపడే గొంతుతో.

రాజకుమారి కాంతిమతి పెదాలమీద చిరునవ్వు కదుల్లాడింది. "ఈ అడవి అంతా తనదని, ఇంతకుముందు ఉగ్రాక్షుడు నాతో అన్నాడు," అన్నదామె.

చిత్రసేనుడు, ఉగ్రాక్షుడికేసి నిప్పులు చెరిగే కళ్లతో చూశాడు. ఉగ్రాక్షుడు గజిబిజి పడిపోయాడు. అతడి నోటివెంట మాట పెగలలేదు. "ఈ అడవి నాదయినా, నేను చిత్రసేన మహారాజు మనిషిని. అందువల్ల అడవికూడా ఆయనదే," అన్నాడతడు బిక్క మొహం వేసి.

"ఇప్పుడు నాకు సంశయనివారణ అయింది. కపిలపురం రాజైన వీరసింహుడి ఏకైక పుత్రిక అయిన నేను—కాంతిమతిని; చిత్రనగర మహారాజయిన చిత్రసేనులవారి సహాయం కోరుతున్నాను. రాజద్రోహి అయిన నాగవర్మవల్ల కారాగారంలో బంధించబడిన నా తండ్రిని రక్షించి, ఆ ద్రోహిని తగువిధంగా

శిక్షించవలసిందని నా ప్రార్థన," అన్నది కాంతిమతి ఎంతో గౌరవం పుట్టిపడే కంఠ స్వరంతో.

కాంతిమతి అలా అనేసరికి చిత్రసేనుడి హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది. అతడు ఉగ్రాక్షుడికేసి తిరిగి, "ఉగ్రాక్షా! నీ పొగరుబోతు మాటలు ఎన్ని అపోహలకు కారణం అవుతున్నవో, యిప్పటికైనా గ్రహించావా? ఇకనైనా 'ఈ అడవి నాది,' అనే బొల్లి మాటలు కట్టిపెట్టు. అంతేకాక, ఇంతకు ముందు నువ్వన్నట్టు, నీవు మహారాజుగారి మనిషివి కాదు, రాక్షసుడివి—నా సేవకుడివి!" అన్నాడు కఠినంగా.

"ఓం, సేవకుణ్ణే, సేవకుణ్ణే, ముమ్మాటికీ!" అంటూ ఉగ్రాక్షుడు కాంతిమతికేసి తిరిగి ప్రణామం చేశాడు.

కాంతిమతి చిరునవ్వు నవ్వింది. చిత్రసేనుడు ఇనుమడించిన వుత్సాహంతో తన అనుచరులకేసి తిరిగి, "మేనావెంట వున్న పులిరాయుళ్లలో ఎవరూ ప్రాణాలతో పారిపోలేదనుకుంటాను. సరే. ఇక మనం సరాసరి కపిలపురానికి బయలుదేరి వెళ్ళాలి. మీలో నలుగురు మేనా ఎత్తుకోండి," అని చెప్పి కాంతిమతితో, "రాకుమారీ, మీరు మేనా ఎక్కండి," అన్నాడు.



కాంతిమతి తల అడ్డంగా తిప్పుతూ, "మహారాజా! ఇప్పుడు నేను బందీనికాను. కనుక, మీతోపాటు స్వేచ్ఛగా గుర్రంమీద ఎక్కి రానివ్వండి," అన్నది.

"అవును, మహారాజా! అదే బావుంటుంది. రాజకుమారి యిందాక పులిరాయుళ్ళను కత్తితో ఎదుర్కొన్న తీరు చూశారు గదా!" అన్నాడు ఉగ్రాక్షుడు.

"ఆమె యిక కత్తిపట్టి యుద్ధం చెయ్యవలసిన అవసరం లేదు. గుర్రం ఎక్కి మన వెంట రావొచ్చు. కపిలపురం కోటను వశపరుచుకోవటం, వీరసింహ మహారాజును బంధవిముక్తుణ్ణి చేయుటం—అదంతా మన



పని. అ ప్రయత్నంలో శత్రువులతో చేయవలసిన పోరు మన సైనికులూ, మనం చేస్తాం," అన్నాడు చిత్రసేనుడు.

అ వెంటనే చిత్రసేనుడి సైనికులూ, ఉగ్రాక్షుడి అనుచరులైన రాక్షసులూ జట్లు జట్లుగా చేరి, అశ్వారూఢులైన చిత్రసేన, కాంతిమతుల వెనకగా, కపిలపురంకేసి బయలుదేరారు. ఒక గంట తరవాత వాళ్లు కొండదాపులవున్న కపిలపురం కోటను సమీపించారు. దూరాన వుండగానే వాళ్ళకు కోట బురుజులమీద వున్న శత్రుసైనికులూ, కోటమీద అకాశంలో పహరా తిరుగుతున్న రెండు భయంకర పక్షులూ కనిపించినై.



ఆ భయంకర పక్షుల్ని చూస్తూనే చిత్రసేనుడితోపాటు, ఉగ్రాక్షుడుకూడా నివ్వెరపోయాడు. ఉగ్రాక్షుడు ఆత్రంగా చిత్రసేనుడి దగ్గిరకు పరిగెత్తుకువచ్చి, "మహారాజా! ఇక్కడకూడా మనపాలిటికి ఈ భయంకర పక్షులు దాపురించినై. సైన్యంతో మీరు పంపిన అమరపాలుడి అయిపూ అజా లేదు. అందర్నీ శత్రువులు స్వాహా చేయలేదు గదా?" అన్నాడు.

చిత్రసేనుడికూ్కడా యిలాంటి అనుమానమే కలిగింది. అతడు కోట ద్వారాలకేసి చూశాడు. అవి బంధించబడి వున్నవి. వాటిముందు ఎక్కడా మరణించిన సైనికులు పడివున్న సూచనలు లేవు. బహుశా, అమరపాలుడు కోటను వశపరుచుకోవటం తన తలకు మించిన పని అని గుర్తించి, ఈ ప్రాంతాల ఎక్కడో కాపలా వేసి వుంటాడు.

చిత్రసేనుడు యిలా ఆలోచిస్తున్నంతలో, అల్లంత దూరంలో చెట్లమధ్య కోలాహలం బయలుదేరింది. చూస్తూండగానే అమరపాలుడు గుర్రాన్ని దూకిస్తూ, చిత్రసేనుడి దగ్గిరకు వచ్చి, "చూశారా మహారాజా! నాగవర్మ ముఖ్య సైన్యంతో కోట వదిలి ధవళగిరి మీదికి దాడివెళ్తూ, కోటకు తగిన

రక్షణ ఏర్పాటుచేశాడు. ఇందాకటినుంచి చూస్తున్నాను. ఆ భయంకర పక్షులు రెండే రెండు కోటమీద గస్తీ తిరుగుతున్నవి. అంతకుమించి కోటలో మరి పక్షులు వున్నట్టు లేదు. బురుజులమీద కాపలా వున్నవాళ్ళు కూడా ఎక్కువమంది కాదు. అయినా, నా వెంటవున్న కొద్దిపాటి సైన్యంతో కోటమీదికి వెళ్ళటం ప్రమాదమని మీ రాకకోసం ఎదురు చూస్తూ, ఇక్కడే కాపు వేశాను," అన్నాడు.

"మంచిపని చేశావు. దుస్సాహసం చేసి వున్నట్టయితే, స్వల్పసంఖ్యలో వున్న మీరందరూ సర్వనాశనం అయిపోయేవాళ్ళు. వేచి వుండటమే మంచిదయింది," అంటూ చిత్రసేనుడు ఉగ్రాక్షుడికేసి తిరిగి, "ఉగ్రాక్షా, మనం కోట ద్వారాలను బద్దలుకొట్టి లోపల జొరబడటమొక్కటే మార్గం. అందుకు తగినవాళ్ళు నీ-అనుచరులు!" అన్నాడు.

ఉగ్రాక్షుడు ఓసారి చిత్రసేనుడికేసీ, కోట మీద ఎగురుతున్న భయంకర పక్షులకేసీ చూసి, తల గోక్కుంటూ, "నా అనుచరుల్లో కొందరిని కోట తలుపులు బద్దలుకొట్టేందుకూ, మరికొందర్ని కోటగోడల్ని పునాదులతో సహా తవ్విపారేసేందుకూ నియోగించగలను. కాని... ఆ భయంకర పక్షులు..." అంటూ గుడ్లు తేలవేశాడు.

"ఉగ్రాక్షా, నువ్వు భయపడకు! అవి మనమీద పడకుండా హడలకొట్టే పని నాది," అన్నాడు అమరపాలుడు.

"అది ఎలా సాధ్యం?" అని అడిగాడు చిత్రసేనుడు ఆశ్చర్యంగా.

"ఇవ్వాళ ఉదయం వాటి కొట్టాలకు నిప్పు పెట్టినప్పుడు, అవి నిప్పంటే ఎంత హడలిపోతవో తెలుసుకున్నాను. కనుక, మన సైనికుల్లో ప్రతి పదిమందిలోనూ ఒకడికి, మండుతున్న కాగడాలు యిస్తే, వాటి రౌతులు చచ్చి గీపెట్టినా అవి మనమీదికి దుమికేందుకు సాహసించవు." అన్నాడు అమరపాలుడు. —(ఇంకావుంది)






# పితృవాక్యపరిపాలన

పూర్వం కాశీనగరానికి సమీపాన ఒక గ్రామంలో జనార్దనుడని ఒక పేద రైతు ఉండేవాడు. అతనికి ఉన్నదల్లా ఒక ఇల్లూ, ఒక కుంట పొలమూనూ. అతనికి వరసగా ఏడుగురు పిల్లలు పుట్టుకొచ్చారు, కాని అందరూ ఆడపిల్లలే. జనార్దనుడు తన కుంట పొలంలోనే కష్టపడి పనిచేసి రకరకాల కూరలు పండించి తన పిల్లలందరినీ ఎంతో శ్రద్ధగా పెంచి పెద్దవాళ్ళను చేశాడు. అతనికి ఒక్కటే దిగులు: తాను ముసలివాడయే సమయానికి చేతికి అక్కరకు వచ్చేటందుకు కొడుకు లేడే అనీ, ఈ ఆడపిల్లలందరికీ కట్నాలు పోసి ఎలా పెళ్ళిళ్ళు చేయటమా అనీనూ.

అయినా జనార్దనుడికి తన కుమార్తెల పైన ద్వేషం ఏమీ లేదు. తనకు ఉన్నంతలో అతను వారికి ఎలాంటి లోపమూ కలగనిచ్చేవాడు కాడు.

ఆడపిల్లలుకూడా తండ్రితోపాటు మడిలో పని చేసేవాళ్ళు.

ఒకసారి జనార్దనుడు తన మడిలో ఉల్లిగడ్డలు పండించి, వాటిని అమ్మటానికి కాశీ నగరం వెళ్ళాడు. నగర ద్వారంవద్దనే అతనికి విశ్వనాధుడనే బాల్య స్నేహితుడు తటస్థపడి, జనార్దనుణ్ణి గుర్తించి, "ఓరీ, ఎంత కాలానికి కనిపించావు! ఏంచేస్తున్నావు? నేను వర్తకంలో సంపాదించి పెద్ద భవంతి కొన్నాను. నాకు ఏడుగురు సంతానం, అంతా మగపిల్లలే! నీకేపాటి సంతానం?" అని ప్రశ్నలు కురిపించాడు.

"నేను మడి దున్నుకు బతుకుతున్నాను. నాకూ ఏడుగురు పిల్లలు. నలుగురు అబ్బాయిలూ, ముగ్గురు అమ్మాయిలూనూ!" అని జనార్దనుడు తన బాల్య మిత్రుడితో అబద్ధం ఆడాడు. తనకు ఒక్క కొడుకూ లేడని చెప్పటానికి జనార్దనుడికి నామోషీ అయింది.

టి. రాఘవరావు



జనార్దనుడు నగరంలో తన పని ముగించుకుని ఇంటికి తిరిగి వస్తూ, తన స్నేహితుడి కోరిక తీర్చటానికి ఉపాయమేదా అని ఆలోచిస్తూండగా, తన ఆడపిల్లలలో ఒకతెకు మగవేషం వేసి పంపితే సమస్య తీరిపోతుందనిపించింది.

అతను ఇంటికి వచ్చి తన కుమార్తెలను ఒక్కొక్కతెనూ పిలిచి జరిగిన సంగతి చెప్పి, "అమ్మా, నువు జుట్టు జులపాలకింద కత్తిరించుకుని మగదుస్తులు వేసుకుని నాలుగు రోజులపాటు విశ్వనాధుడి కొడుకుకు తోడుగా ఉంటావా?" అని అడిగాడు.

వరసగా అరుగురు ఆడపిల్లలూ ఈ పనికి నిరాకరణ తెలిపారు. ఆడపిల్లలు జుట్టు కత్తిరించుకోవటం అశుభమన్నారు; మగవేషం వేసుకోవటం సిగ్గుచేటు అన్నారు; పరువైన ఆడవాళ్ళు ఎవరూ అటువంటి పనులు చెయ్యరనీ, అలా చేసినవాళ్ళకి అ తరవాత పెళ్ళిళ్ళుకూడా కావనీ అన్నారు. అదంతా నిజమే గనక జనార్దనుడు ఏమీ వాళ్లను అనలేకపోయాడు.

అతని ఆఖరు కుమార్తె శశి అనేది మటుకు తండ్రి చెప్పినట్టు చెయ్యటానికి ఒప్పుకున్నది. "నాన్నా, నువు మాకోసం పడిన కష్టానికి ప్రతిఫలం ఏమీ ఇవ్వలేను.

ఈ కాస్త అబద్ధం చెప్పినందువల్ల ఏం నష్టం రాబోయింది లెమ్మనుకున్నాడు అతను.

కాని ఈ మాట వినగానే విశ్వనాధుడు, "భేష్! నాకొక ఉపకారం చేస్తావా? నా చిన్న కొడుకు ఈ మధ్య ఖాయిలాపడి కోలుకుంటున్నాడు. వాడికి తోడుగా ఉండటానికి నీ కొడుకుల్లో ఒకణ్ణి పంపుదూ, నీకు పుణ్యం ఉంటుందీ!" అన్నాడు. జనార్దనుడు అడకత్తెరలో చిక్కుకున్న పోకలాగా అయిపోయి, "చూదాంలే!" అన్నాడు.

"చూడటంకాదు, తప్పక పంపు. మన మధ్యలాగే మన పిల్లలమధ్య కూడా స్నేహం ఏర్పడుతుంది," అన్నాడు విశ్వనాధుడు.

అందుచేత నీకోసం ఏంచెయ్యమన్నా చేస్తాను," అన్నదామె.

శశి తన జుట్టును మెడపరకూ కత్తిరించుకుని, మగదుస్తులు ధరించి, చెప్పులు తొడుక్కుని, చేతికర్ర పట్టుకుని, కాశీనగరంలో ఉన్న విశ్వనాధుడి ఇంటికి వెళ్లింది. ఆ ఇల్లు రాజసాధంలాగా ఉంది. తన బాల్య మిత్రుడి కొడుకు తన మాట తీసెయ్యకుండా వచ్చినందుకు విశ్వనాధుడు చాలా సంతోషించి, శశిని తన ఆఖరు కొడుకైన సుదర్శనుడి వద్దకు పంపాడు.



సుదర్శనుడు ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నాడు. మగవేషంలో ఉన్నప్పటికీ శశిని చూస్తూనే అతను ఆమె ఆడదని అనుమానించాడు. ఆ అనుమానం ఆరోజుకారోజు పెరగసాగింది. శశి అస్తమానం అతనికి ఏవేవో కబుర్లు చెప్పేది, సపర్యలు చేసేది. ఆమె దగ్గిర ఉండటంమూలాన సుదర్శనుడికి ఉత్సాహం వచ్చి ఆరోగ్యం మరింత శీఘ్రంగా చేకూరింది.

అయితే అతనికి ఒక వ్యాధి పోయి ఇంకొక వ్యాధి సోకినట్టయింది. ఎందుకంటే సుదర్శనుడు తన మిత్రుడు స్త్రీ అని తెలుసుకోవటమే గాక ఆ స్త్రీని ప్రేమించటంకూడా ప్రారంభించాడు. ఈ ప్రేమను తన మనస్సులోనే దాచుకుని అతను విచారంతో కుమిలిపోసాగాడు.

సుదర్శనుడిలో కలిగిన ఈ మార్పు అతని తల్లి గమనించి, "ఎందుకింత విచారంగా ఉంటున్నావు? నీకేంకావాలి?" అని అడిగింది.

"అమ్మా, జనార్దనుడి కొడుకునని చెప్పుకుంటూ నాతో స్నేహంగా ఉన్న మనిషి ఆడపిల్ల. నేనామెను ప్రేమిస్తున్నాను. మగవాడిలాగా తిరుగుతున్న ఆమెతో నా ప్రేమ ఎట్లా చెప్పుకునేది? ఏంచెయ్యటానికీ నాకు పాలుపోవటంలేదు. నువే ఏదైనా మార్గం చెప్పు!" అన్నాడు సుదర్శనుడు.




"ఆ అబ్బాయి నిజంగా ఆడపిల్లే అయితే ఆ సంగతి సులువుగానే బయటపెట్టవచ్చు. నీవెంట గుర్రం ఎక్కి వేటకు రమ్మని పిలు. పొగరుబోతు గుర్రాన్ని ఇచ్చావంటే ఆడదైతే ఎక్కదు, భయపడుతుంది. అలాగే విల్లూ, బాణాలూ పట్టటానికి కూడా ఆడది భయపడుతుంది. నిజం తెలిసిపోతుంది. అప్పుడామె తాను ఆడదాన్నని ఒప్పేసుకుంటుంది!" అన్నది సుదర్శనుడి తల్లి.

సుదర్శనుడు మర్నాడు శశిని వేటకు పిలిచాడు. ఆమె సరేనన్నది. అతను ఆమెకు ఒక పొగరుగల గుర్రాన్ని ఇచ్చాడు. శశి దానిపైన ఎక్కటమే గాక క్షణంలో దాన్ని స్వాధీనంలోకి తెచ్చుకున్నది. తరవాత ఇద్దరూ వేటకు వెళ్ళారు. సుదర్శనుడికన్న శశే రెట్టింపు బాగా వేటాడింది.

ఇంటికి వస్తూనే సుదర్శనుడు తల్లికి జరిగినదంతా చెప్పాడు.

"నువు పొరబడ్డావేమోరా, నాయనా? అది నిజంగా మగపిల్లవాడేనేమో!" అన్నది తల్లి.

"కాదమ్మా, ఆడపిల్లే! ఇవాళ నాకు ఆమె మీద ప్రేమ రెట్టింపయింది! ఏంచెయ్యను?" అన్నాడు సుదర్శనుడు.

"ఆ అమ్మాయి దొరికిపోవటానికి అద్భుతమైన ఉపాయం చెబుతాను విను. రేపు ఆ పిల్లను, నా నగలు చూడటానికి తీసుకురా. మిగిలినది నే చేస్తాను," అన్నది సుదర్శనుడి తల్లి.

మర్నాడు సుదర్శనుడు శశితో తన తల్లి వద్ద ఉండే నగలు సర్దటానికి తోడు రమ్మన్నాడు. ఇద్దరూ నగల గదికి వచ్చారు. సుదర్శనుడు తల్లి నగల పెట్టెలన్నీ తెరిచి నగలు పైకి తీశాడు. ఆ రత్నాలూ, ముత్యాలూ, రకరకాల బంగారు ఆభరణాలూ, వజ్రపుటుంగరాలూ చూస్తూంటే శశికి మతిపోయినట్టయింది. ఎంతమంది రాజులవద్దకూడా అన్ని నగలుండవని ఆమె అనుకున్నది.

ఇంతలో అవతలనుంచి తల్లి సుదర్శ నుణ్ణిపిలిచింది. సుదర్శనుడు వెళ్లిపోయాడు. వెంటనే శశి ఆ నగలలో కొన్ని తీసి తన మెడలో వేసుకు చూసుకున్నది. ఉంగరాలు వేళ్లకు పెట్టి చూసుకున్నది. ఇదంతా చాటు నుండి సుదర్శనుడూ, అతని తల్లీ చూస్తూనే ఉన్నారు.

అంతలో ఏదో అలికిడి అయింది. తనను ఎవరో గమనిస్తున్నట్టు శశికి అనుమానం తట్టింది. ఆమె తన మెడలో నగలూ, వేలి ఉంగరాలూ తీసి అక్కడే పడేసి బయటికి పరుగెత్తి, ఎక్కడా ఆగకుండా నేరుగా ఇంటికి వచ్చేసింది.

అక్కడ సుదర్శనుడు ఆమెకోసం అంతటా వెతికినాక ఆమె ఇంటికి వెళ్లిపోయి ఉంటుందని తెలుసుకున్నాడు. "ఇప్పుడేం చెయ్యాలి?" అని అతను తల్లి సలహా అడిగాడు.

"జనార్దనుడి ఇంటికి వెళ్ళావంటే నీకా పిల్ల అసలు రూపంలో దొరుకుతుంది. జనార్దనుడితో చెప్పి ఆమెను తెచ్చి పెళ్లిచేసుకో! అంతకన్న ఏమున్నదీ?" అన్నది తల్లి.

సుదర్శనుడు వెళ్ళేసరికి జనార్దనుడు ఇంటి అరుగుమీద దిగాలుపడి కూచుని ఉన్నాడు. "మీ అబ్బాయి మా ఇంటినుంచి ఎవరితోనూ చెప్పకుండా వచ్చేశాడు. కాస్త



మాట్లాడాలి, పిలిపిస్తారా?" అని సుదర్శనుడు అడిగాడు.

"ఇక్కడే కూచో, బాబూ! ఇప్పుడే పిలుస్తాను," అంటూ జనార్దనుడు లోపలికి వెళ్లాడు, అప్పటికే శశి వేషం మార్చుకుని తనకున్న నగలు నాలుగూ పెట్టుకుని ఉన్నది. ఆమె గబగబా తన నగలు తీసేసి, తాను అంతకు మునుపు విడిచేసిన మగ దుస్తులు ధరించి బయటికి వచ్చింది. కాని, పాపం, ఆమె తన చెవికి ఉన్న పోగులు తీయటం మరిచిపోయింది. సుదర్శనుడు వాటికేసి చూసి నవ్వాడు. ఆమె తన చేతులతో చెవులను కప్పుకున్నది.

"ఇంక నీ రహస్యం దాగదు. నిన్ను నేను పెళ్లాడాలని నిశ్చయించుకున్నాను, మా యింటికి పోదాం, పద!" అన్నాడు సుదర్శనుడు. "ఈ పెళ్లికి మీ తండ్రిగారి అనుమతి అయిందా, నాయనా?" అని జనార్దనుడు సుదర్శనుణ్ణి అడిగాడు.

"లేదు. కావలిస్తే మీరుకూడా మా వెంట వచ్చి మా నాన్నను అడగండి!" అన్నాడు సుదర్శనుడు. అతని వెంట శశీ, జనార్దనుడూ వెళ్ళారు.

విశ్వనాధుడు అంతా విని, "నీ కూతురికీ నా కొడుక్కూ పెళ్ళికావటం కన్న నాకు మరేంకావాలి? కాని నీ కొడుకును పంపమంటినికదా, కూతుర్ని పంపావేమిటి?" అని జనార్దనుణ్ణి అడిగాడు.

జనార్దనుడు తల వంచుకుని, "నాకు కొడుకులుంటేగద పంపటానికి. నీకు ఏడుగురూ కొడుకులే అయితే నాకు ఏడుగురూ కూతుళ్ళే. ఆ మాట బయటపెట్టటానికి సిగ్గేసి అబద్ధం చెప్పాను!" అన్నాడు.

"మంచివార్తే చెప్పావు. నీ కూతుళ్ళనందరినీ నా కొడుకులకి ఇచ్చెయ్యి. అందరికీ ఒకే మంచి ముహూర్తం చూసి పెళ్లిళ్లు చేసేద్దాం!" అన్నాడు విశ్వనాధుడు. అలాగే జరిగిందికూడానూ.





"వీరే పెద్దాపురం చిన్నబ్బాయిగారు—
బహు దొడ్డ హార్మోనిస్టు...."



"ఇదిగో వచ్చేస్తున్నా—తల
దువ్వుకుని...."



"ఈ మాత్రల్లు – పడుకొనేటప్పుడు
ఒకటేసుకోండి – పొద్దున్నే లేస్తే
మరొహటి మింగండి."



"ఏమి మేష్టార్లో!—రెండుకి రెండు
కలిపితే ఎంతో తెలీదు—నన్నడుగు
తున్నాడా మేష్టారు!"

చిత్రకారుడు : ఎస్. శంకరనారాయణ




# చారుదత్తుడు

పూర్వం ఉజ్జయినీ నగరం వర్తకానికి ప్రసిద్ధికెక్కినది. ఆ నగరంలో మహా ధన సంపన్నుడైన బ్రాహ్మణ యువకుడుండే వాడు. అతని పేరు చారుదత్తుడు. అతను అడిగినవారి కెన్నడూ లేదనేవాడు కాడు, మిత్రులకు అంతు లేని బహుమానా లిచ్చే వాడు, దేవతారాధనకు ఎంత పెద్ద ఎత్తున అయినా ఖర్చుచేసేవాడు. ఈ కారణంగా అతను పేదవాడైపోయాడు.

ఆ నగరంలోనే వసంతసేన అనే ప్రముఖ నర్తకి ఉండేది. ఆమె గొప్ప సౌందర్యవతి కావటమేగాక వివేకవతి కూడానూ. ఒకఏడు కామదేవోత్సవం జరిగి నప్పుడు వసంతసేన చారుదత్తుణ్ణి చూసి ప్రేమించింది. అదే సందర్భంలో చారు దత్తుడు వసంతసేనను చూసి ఆమెను ప్రేమించటంకూడా జరిగింది. కాని ఒకరి ప్రేమ ఒకరికి తెలియదు.

ఒక బహుళ షష్ఠినాటి రాత్రి వసంతసేన వీధివెంట వస్తూండగా సంస్థానకుడు అనే వాడు ఆమెవెంట పడ్డాడు. ఈ సంస్థానకుడు రాజుగారి బావమరిది; ఇతణ్ణి శకారుడని అందరూ అనేవారు. ఇతను పరమ మూఢుడూ, పరమ దుష్టుడూనూ. ఈ దుష్టుడి బారినుంచి తప్పించుకోవటానికి వసంతసేన చీకటిలో పడి పరిగెత్తుతూ సమీ పంలో కనిపించిన ఇంటి పక్కవాకిలినుంచి లోపలికి ప్రవేశించింది.

అది చారుదత్తుడి ఇల్లే. ఈ సమయానికే చారుదత్తుడు షష్టిపూజ చేసి తన మిత్రు డైన మైత్రేయుణ్ణీ, అతనికి తోడుగా తన పరిచారిక అయిన రదనిక అనేదాన్నీ వీధి లోకి వెళ్లి బలి వేసి రమ్మన్నాడు. రదనిక మైత్రేయుడివెంట బయలుదేరింది. అప్పుడే లోపలికి వచ్చిన వసంతసేన, తనను చూసి వాళ్ళు గట్టిగా మాట్లాడతారనీ, బయట తన

కోసం చీకటిలో వెతుకుతున్న శకారుడికి తెలిసిపోతుందనీ, తన కొంగు విసిరి మైత్రేయుడి చేతిలో ఉన్న దీపం ఆర్పేసింది. అది గాలికి ఆరిందనుకుని మైత్రేయుడు మళ్లీ వెలిగించుకురావటానికి లోపలికి వెళ్ళాడు. రదనికమాత్రం వీధిలోకి వెళ్లింది.

వసంతసేన ఏమయిందా అని అటూ ఇటూ చూస్తున్న శకారుడు రదనికను చూసి వసంతసేనే అనుకుని ఆమెను పట్టుకున్నాడు. రదనిక శకారుణ్ణి తన్ని మైత్రేయుణ్ణి కేకపెట్టింది. మైత్రేయుడు, "ఆఁ, ఆఁ! అదేం పని?" అంటూ దీపంతో వచ్చాడు. శకారుడు తన తప్పు తెలుసుకుని మైత్రేయుడితో, "ఆ దరిద్ర చారుదత్తుడితో నామాటగా చెప్పు: వసంతసేన అనే నాటకాలలో నటించే నర్తకి అనేక సువర్ణాభరణాలతో నీయింట ప్రవేశించింది. ఆమెను రేపు నా వశము చేయకపోయావో, వెల్లుల్లిపాయను పావురం కొరికినట్టు నీ తల చితకగొట్టేస్తాను!" అన్నాడు.

"అలాగేం?" అంటూ మైత్రేయుడు శకారుడి మొహాన దీపం ఆడించేసరికి శకారుడు చల్లగా జారుకున్నాడు.

ఈలోపల చారుదత్తుడు లోనికి వచ్చిన వసంతసేనను చూసి తన పరిచారిక అనుకుని, "బలులు వేసేశారా? ఇది తీసుకుపోయి లోపల పెట్టు," అంటూ తన ఉత్తరీయం వసంతసేన కిచ్చాడు. ఆమె కదలకపోవటం చూసి చారుదత్తుడు, "ఏమిటి సంకోచిస్తున్నావు?" అంటూండగా బయటి నుంచి మైత్రేయుడూ, రదనికా హడావిడిగా లోపలికి వచ్చారు.




మైత్రేయుడు చారుదత్తుడితో, "వసంతసేన మన ఇంటికి వచ్చిందనీ ఆమెను రేపు తన వశం చెయ్యకపోతే నిన్ను చంపేస్తాననీ శకారుడు నీతో చెప్పమన్నాడు," అన్నాడు.

వెంటనే వసంతసేన చారుదత్తుణ్ణి సమీపించి, "నన్ను కాపాడండి!" అన్నది.

"ఏమిటి, వసంతసేనేనా?" అన్నాడు చారుదత్తుడు ఆశ్చర్యంతో.

రాకరాక వసంతసేన తన ఇంటికి వచ్చేసరికి తాను ఆమెకు సరిఅయిన ఆతిథ్యం ఇవ్వలేని స్థితిలో ఉన్నందుకు చారుదత్తుడు విచారించాడు. తానైతాను అక్కడ ఉండిపోవటం అమర్యాదగా ఉంటుందని వసంతసేన భావించింది. అయితే మరొకసారి చారుదత్తుణ్ణి చూడటానికి అవకాశం కలగగలందులకు ఆమె ఒక ఉపాయం ఆలోచించింది. ఆమె అతనితో, "అయ్యా, నేను ఇంటికి వెళ్లాలి. ఈ నగలు నామీద ఉంటే దుష్టులు వెంటపడతారు. అందుచేత వీటిని ప్రస్తుతం మీ వద్దనే ఉంచండి," అన్నది. చారుదత్తుడు సరేనని వసంతసేన నగల పెట్టెను మైత్రేయుడికి ఇప్పించాడు. మైత్రేయుడు దానిని రదనిక కిస్తూ, "ఈ పెట్టెను ఈ షష్ఠీ, సప్తమీ వెళ్లేదాకా నీ దగ్గిర ఉంచి అష్టమినాడు నాకిచ్చెయ్యి," అన్నాడు. ఆమె సరేనన్నది.

తరవాత చారుదత్తుడు వసంతసేనను రాజమార్గందాకా సాగనంపి, ఆమెను ఇంటి దగ్గిర దిగవిడిచి రమ్మని తోడుగా మైత్రేయుణ్ణి పంపాడు.

అది మొదలు వసంతసేన అస్తమానం చారుదత్తుణ్ణే తలుచుకుంటూ ఉండసాగింది.



ఒకసారి ఒక మనిషి కంగారుగా ఆమె ఇంట జొరబడి శరణువేడాడు. ఆ మనిషి ఒకప్పుడు పాటలీపుత్ర నగరవాసి. వర్తకం చేసుకుంటూ బాగానే బతికినవాడు. వర్తకంలో కలిసిరాక పేదవాడై పోయాడు. అతను సరదాకు ఒళ్లుపట్టే విద్య నేర్చుకుని ఉన్నవాడు కావటంచేత, ఉజ్జయినీ నగరపు ధనిక వ్యాపారులను గురించి అందరూ చెప్పగా విని, అక్కడి శ్రీమంతులకు ఒళ్లు పట్టి జీవించాలనే ఉద్దేశంతో వచ్చాడు. అతనికి చారుదత్తుడు ఆశ్రయమిచ్చి దగ్గిర ఉంచుకుని పోషించాడు. అయితే చారుదత్తుడు తనకున్నదంతా పోగొట్టుకోగానే అతని నౌకర్లందరికీ ఆశ్రయం పోయింది. చెట్టు పడిపోయాక పక్షుల్లాగా అందరూ తలా ఒకదారీ అయారు. ఈ ఒళ్లుపట్టేవాడు జూదం మరిగాడు. జూదంలో అతను ఒక మనిషికి పది బంగారుకాసులు బాకీపడ్డాడు. ఆ బాకీదారు ఎదురయేసరికి తప్పించుకునేటందుకు వసంతసేన ఇంట్లోకి దూరాడు.

వసంతసేన అతని కథ అంతా విని బాకీ తీర్చగలందులకు అతనికి ధనం ఇస్తూ, "ఇది చారుదత్తుడే ఇచ్చినట్టు భావించి తీసుకోండి," అన్నది.

ఆ మనిషి వెళ్ళాడో లేదో, వసంతసేన నౌకరు పరిగెత్తుకుంటూ వచ్చి ఒక వింత






చెప్పాడు. భద్రకపోతమనే ఏనుగు కొలను నుంచి అతి వేగంగా తిరిగి వస్తూ, కాషాయ వస్త్రాలు ధరించిన ఒక సన్యాసిని చూసి, ఉద్రేకం చెంది, అతనిని తొండంతో పట్టుకుని అటూ ఇటూ విసరసాగిందట. అక్కడ ఉన్న జనమంతా, "చచ్చాడు! చచ్చాడు!" అని కేకలు పెట్టారట. ఆ సమయంలో వసంతసేన నౌకరు ధైర్యంగా ఏనుగును సమీపించి తన పిడికిలితో గుద్ది దానిని పారదోలి, సన్యాసిని కాపాడాడు. అందరూ వాణ్ణి మెచ్చుకున్నారట, కాని ఎవరూ బహూకరించలేదుట. ఆ సమయానికి అటుగా వచ్చిన ఒక సలక్షణుడైన యువకుడు ఆ నౌకరుకు ఏ ఉంగరమైనా ఇద్దామని తడువుకుని, ఏమీ దొరకక తనమీద ఉన్న పై బట్ట ఇచ్చాడట.

"ఇదుగోనమ్మా, ఆయన ఇచ్చిన పైబట్ట!" అన్నాడు నౌకరు. అది చారుదత్తుడిదని వసంతసేన గుర్తించింది. ఆ సమయంలోనే చారుదత్తుడు పైబట్ట లేకుండా వీధివెంట నడిచిపోతూంటే ఆమె పిట్టగోడ వద్ద నిలబడి అతను కనుచూపుమేర దాటిపోయే దాకా చూసింది.

అష్టమినాటి అర్ధరాత్రిదాకా వీణపాట విని చారుదత్తుడూ, మైత్రేయుడూ ఇంటికి తిరిగి వచ్చారు. రదనిక తన యజమాని చెప్పినప్రకారం వసంతసేన నగలపెట్టె తెచ్చి ఇచ్చింది. ఆ పెట్టె తీసుకుని జాగ్రత్తగా దగ్గిర ఉంచుకోమని మైత్రేయుడితో చారుదత్తుడన్నాడు.

"దీన్ని లోపల ఇంట్లో ఎందుకు దాచిపెట్టవు?" అన్నాడు మైత్రేయుడు.

"మూర్ఖుడా, నా భార్య చూడదా?" అన్నాడు చారుదత్తుడు.

"ఏంచేస్తాం? ఇది ఎలాగూ దొంగల పాలే!" అనుకుంటూ మైత్రేయుడు ఆ నగల పెట్టె తీసుకున్నాడు. ఇద్దరూ పడుకున్నారు. చారుదత్తుడికి వెంటనే నిద్రపట్టింది. మైత్రే

యుడు కలతనిద్రలో పక్కమీద అటూ ఇటూ పొర్లసాగాడు.

ఆ రాత్రే చారుదత్తుడి ఇంటికి ఒక దొంగ కన్నంవేసి లోపల ప్రవేశించాడు. ఆ దొంగ పేరు సజ్జలకుడు. ఈ సజ్జలకుడు చోరవిద్య నేర్చినవాడే అయినా అది వృత్తిగా గలవాడు కాడు. అతను వసంతసేన దాసి అయిన మదనికను ప్రేమించాడు. ఆమెను దాస్యవిముక్తురాలిని చేసి పెళ్లాడాలని అతని ఉద్దేశం. కొంత ధనం తెచ్చి ఇస్తేతప్ప వసంతసేన మదనికకు స్వాతంత్ర్యం ఇవ్వదు. అందుకోసం అతడు దొంగతనానికి బయలుదేరాడు.




అయితే అతను చారుదత్తుడి ఇంట్లోకి ప్రవేశించగానే అది పేద ఇల్లని తెలిసిపోయింది. మోసంచేత ధనం సంపాదించే వర్తకుల ఇళ్లలో దొంగతనం చెయ్యటానికి సజ్జలకుడికి అభ్యంతరం లేదుగాని, పేదవాళ్ల ఇళ్లంటే అతనికి కనికరం ఉన్నది. అతను వెళ్లిపోదామనుకుంటుండగా మైత్రేయుడు, "ఈ నగలపెట్టె తీసేసుకుందూ, నన్ను చంపకా!" అన్నాడు.

నగలపెట్టె అనే మాట చెవినపడింది. ఆ మాట్లాడిన మనిషి మేలుకుని లేడనీ, అతని చెయ్యి ఒక బంగారు పెట్టెమీద ఉన్నదనీ సజ్జలకుడు చూశాడు. వెంటనే అతను ఒక డబ్బీ తెరిచి రెక్కలపురుగు నొకదాన్ని విడిచిపెట్టాడు. అది వెళ్లి దీపం ఆర్పేసింది.

మైత్రేయుడు చప్పున నిద్ర మేలుకుని, "అయ్యో, దీపం ఆరిపోయింది! ఇదుగో, చారుదత్తా, ఈ నగలపెట్టె తీసుకో, దీని మూలంగా నిద్రపట్టక భయపడి చస్తున్నాను. తీసుకుంటావా, శపించనా?" అన్నాడు.

ఆ చీకటిలో సజ్జలకుడు మైత్రేయుడి చేతినుంచి నగలపెట్టె అందుకున్నాడు. "అమ్మయ్య, ఇక సుఖంగా నిద్రపోతాను," అనుకుంటూ మైత్రేయుడు మళ్లీ నిద్రపోయాడు. ఇంతలో తెల్లవారుజాము నగారా మోగింది. సజ్జలకుడు వెళ్లిపోయాడు.

మరికాస్సేపటికి చారుదత్తుడి దాసి రదనిక, "మైత్రేయా, మైత్రేయా! దొంగలు ఇంటికి కన్నం వేశారు," అంటూ వచ్చింది. "ఏదీ, ఏదీ?" అంటూ మైత్రేయుడు వెళ్ళి చూసి, ఈ "శుభవార్త" చారుదత్తుడికి చెప్పి, "చూశావా, నేనేమో వెర్రివాణ్ణను కుంటావు! రాత్రి నేనా నగల పెట్టెను నీ కిచ్చెయ్యటం ఎంత మేలయిందో చూడు!" అన్నాడు.

"నా కివ్వందే?" అన్నాడు చారుదత్తుడు. దొంగవాడు వచ్చి, వసంతసేన చారుదత్తుడి వద్ద దాచబెట్టిన నగలపెట్టె కాస్తా ఎత్తుకు పోయినట్టు స్పష్టమయింది.

"అందరూ నన్నే అనుమానిస్తారు! ఎవరో దొంగలు ఎత్తుకుపోయారని పేదవాడు నిజం చెబితేమాత్రం నమ్మేదెవరు?" అనుకున్నాడు చారుదత్తుడు. జరిగిన సంగతి చారుదత్తుడి భార్యకు తెలిసింది. ఆమెవద్ద పుట్టింటివారిచ్చిన ముత్యాలహారం, లక్ష విలువచేసేది ఉన్నది. పోయిన నగల పెట్టెకు బదులుగా ఆ హారాన్ని వసంతసేనకు అందజేయమని మైత్రేయుడి కిచ్చి పంపింది.

మైత్రేయుడు హారంతెచ్చి చూపగానే చారుదత్తుడు తన భార్య ఔదార్యం చూసి కంట తడి పెట్టాడు.



వసంతసేన తన ఇంట కూచుని చారుదత్తుడి చిత్తరువు చిత్రిస్తున్నది. ఇంతలో శకారుడు ఆమెకోసం నగలూ, బండీ పంపాడు. ఆ సంగతి చెప్పవచ్చిన దాసిని వసంతసేన తిట్టి పంపింది. ఇంతలో సజ్జలకుడు వచ్చి అవతలనుంచి మదనికను పిలిచాడు. మదనిక వెళ్ళింది. పక్కనుంచి వారి సంభాషణ వసంతసేన చెవినిపడింది.

సజ్జలకుడు మదనికతో, "నీకు దాస్య విముక్తి చెయ్యటానికి చారుదత్తుడనే ఆయన ఇంట దొంగతనం చేసి ఈ నగలపెట్టె ఎత్తుకు వచ్చాను. వీటిని మీ యజమానురాలికిచ్చి దాస్యవిముక్తురాలివికా!" అన్నాడు.

మదనిక ఆ నగలపెట్టెను గుర్తించి, అది వసంతసేనదేనని అతనికి చెప్పింది.

"ఏం ప్రారబ్దం వచ్చిపడింది! ఇప్పుడేం చెయ్యమంటావు?" అన్నాడు సజ్జలకుడు కుంగిపోయి.

"మాట్లాడకుండా లోపలికి వెళ్ళి ఈ పెట్టెను వసంతసేన కిచ్చి, మీ యజమాని అయిన చారుదత్తుడు ఇయ్యమన్నాడని చెప్పు," అన్నది మదనిక.

ఈ లోపుగానే మైత్రేయుడు ముత్యాల హారం తీసుకుని వసంతసేన ఉండేచోటికి వచ్చి, "మా చారుదత్తుడు బుద్ధిమంతుడనుకుని నీ నగలపెట్టె తెచ్చి అతనివద్ద



దాచబెట్టావు. దానిని అతను కాస్తా జూదంలో పోగొట్టుకున్నాడు. దానికి ప్రత్యామ్నాయంగా ఈ ముత్యాలహారం నీకు పంపాడు, పుచ్చుకో!" అన్నాడు.

"సరే ఇవ్వండి," అన్నది వసంతసేన.

మైత్రేయుడు వెళ్ళాడో లేదో, మదనిక వచ్చి, "అమ్మా, మిమ్మల్ని చూడటానికి చారుదత్తుడుగారి మనిషి వచ్చాడు," అని చెప్పింది. సజ్జలకుడు లోపలికి వచ్చి వసంతసేనకు నగలపెట్టె ఇస్తూ, "మా యజమాని మీ కిది ఇచ్చి రమ్మని పంపారు. వారిది చాలా పాతకాలపు ఇల్లు. దొంగల భయం జాస్తి," అన్నాడు.

"ఈ నగలపెట్టెను తీసుకుపోయి మీ యజమాని కిచ్చి, మరికొద్ది రోజులపాటు ఆయన వద్దనే ఉంచమను," అన్నది వసంతసేన.

"అమ్మో, అది నావల్ల కాదు!" అన్నాడు సజ్జలకుడు.

"ఎందుకు నీవల్ల కాదో నాకు తెలుసును. నువు దీనిని వారి ఇంటినుంచి దొంగిలించి తెచ్చావు!" అన్నది వసంతసేన. సజ్జలకుడు కొయ్యబారిపోయాడు.

వసంతసేన మదనికకు నగలు పెట్టి, బండి తెప్పించి, "మీరిద్దరూ బండి ఎక్కి వెళ్ళిపోయి పెళ్ళాడండి. ఇతన్ని చెడుమార్గం నుంచి తప్పించిన కారణంచేత ఇతనికి భార్య కావటానికి అర్హురాలివే!" అన్నది.

తరవాత వసంతసేన చతురిక అనే దాసిని పిలిచి, "పదవే, చారుదత్తుడి ఇంటికి వెళ్ళి ఈ ముత్యాలహారం ఇద్దాం," అన్నది.

"అమ్మగారూ, పెద్ద వర్షం రాబోతున్నది," అన్నది చతురిక.

"నాకు ఎదురు చెబుతావుటే!" అన్నది వసంతసేన.

"లేదు, అమ్మగారూ! పదండి!" అన్నది చతురిక. ఇద్దరూ చారుదత్తుడి ఇంటికి బయలుదేరారు...





# క్షీరసాగర మథనము

ద్వితీయాశ్వాసము :

ఆంగీరసుతో ఇంద్రుడు
అడవుల బడి పోయినాడు;
ఆకలములు తిని ఆకలి
పోకార్పగ సాగినాడు.

ఆతని దురవస్థల కని
ఆంగీరసు డెంతొ వగచి,
"భగవంతుని దయలేనిది
పడయలేము సౌఖ్యములను.

బ్రహ్మదులు అతని దయకు
పడిగాపులు వడి యుందురు;
ఆతని కొక యజ్ఞములే
ప్రీతిని కలిగింపగలవు.

కావున, ఓ దేవేంద్రా!
నీవిక పలు యజ్ఞములను
చేసి, విష్ణు దయను పొంది
చెండాడుము రక్కసులను,"

అని చెప్పిన, దేవేంద్రుడు
ఆంగీరసు తోడ్పాటున
నూర్లకొలది యాగములను,
నోముల నెన్నో నోచెను.

అటుపిమ్మట బ్రహ్మదేవు
డచ్చట ప్రత్యక్షమయ్యె;
దేవేంద్రుడు సాగిలపడి
దీనముగా వేడుకొనెను:

"ఇంద్రా! నీ యజ్ఞములకు
ఎంతయొ సంతోషించితి.
నీ కోరిక నెఱవేర్పగ
నేనిచ్చట కేతెంచితి."

"ఓ దేవా! స్వర్గలోక
మాదిత్యుల కిప్పింపుము!
బలిని గెలుచు సామర్థ్యము
కలిగింపుము నాకు, ప్రభూ!"

ఉత్పల సత్యనారాయణాచార్య



అని ఇంద్రుడు తన కోరిక
వినిపింపగ, బ్రహ్మదేవు
డాలోచన చేసి తుదకు
అతనితోడ ఇట్లనియెను:

"దుర్వాసుని శాపముచే
తొలగిపోయె నీ విభవము!
బలిరాజును ఇంతలోన
గెలుచుట అది సాధ్యపడదు.

అతని తాత భక్తులలో
అగ్రేసరుడై యుండెను;
అతడు ధర్మాత్ములలో
అగ్రగణ్యుడై యుండెను.

అతనియందు విష్ణువునకు
అమితమైన ప్రేమ గలదు.
అదియుగాక ముజ్జగముల
అతడేలగ తగినవాడు.

దేవేంద్రా! నీ కోర్కెను
తీర్చలేని వాడ నయితి!
విష్ణుమూర్తి కిది యెల్లను
విజ్ఞాపన మొనరింతము."

అని విధాత వగపుతోడ
హరినిగూర్చి ప్రార్థించెను;
సాగిలపడి దేవేంద్రుడు
జగదీశుని స్తుతియించెను.

అంతలోన కోటిసూర్య
కాంతులు వెలుగొందించెను!
పక్షీంద్రుని పెనురెక్కల
పరిసరములు కంపించెను!

గరుడునిపై విష్ణుమూర్తి
గగన సీమ కేతెంచెను!
నలు మొగములతో విధాత
నారాయణు స్తుతియించెను:

"పరమ పురుష! నారాయణ!
భక్త త్రాణ పరాయణ!
దేవేంద్రుని కోర్కె నేను
తీర్చలేక పోయినాడ!

ముజ్జగముల రక్కసులే
మురియుచు ఏల దొడంగిరి!
సజ్జనులను బాధించుచు
జగముల నేప గడంగిరి!

దితి సుతులకు అపజయమును,
దివి నీతని కిమ్ము, ప్రభూ!"
అని విధాత ప్రార్థింపగ
హరి యిట్టులు సెలవిచ్చెను:

"దైతేయుల గెలుచునట్టి
తరుణం బిది కానేరదు!
వారలతో చెలిమిచేసి
క్షీరాబ్ధిని మధియించుడు!

అం దమృతము పుట్టగలదు—
అది త్రాగిన చావుండదు!
ఆలసింపకిక మీరలు
పాల సంద్రమును చిల్కుడు!"

అని విష్ణువు కరుణతోడ
ఆనతిచ్చి మాయమయ్యె.
ఆ విధమున చేయుమనుచు
ఆ విధాత చెప్పిపోయె.

బలిభూపతి సాయమునకు
బయలుదేఱె దేవేంద్రుడు—
ప్రాణము లఱచేత బట్టి,
భారము హరిపైన బెట్టి!



త్రోవలోన రక్కసులా
దేవేంద్రుని చూచినారు;
పెడరెక్కలు విఱిచికట్టి
బడబడ గొనిపోయినారు!

బలిభూపతి కట్టెదుటను
నిలబెట్టిరి దేవేంద్రుని.
ఇంద్రుడపుడు బలికి మ్రొక్కి
ఈ రీతిగ విన్నవించె:

"దైత్యరాజ! మహాతేజ!
తమతో ఒక మంచి మాట
చెప్పుటకై వచ్చినాడ,
చెలిమిగోరి వచ్చినాడ!

పాలకడలి చిలికినంత
పయికి తేలునట అమృతము!
ఆ యమృతము త్రాగువారు
అమరులు కాగలవారట!

బ్రహ్మదేవునకు విష్ణువు
ప్రత్యక్షమ్మయి చెప్పెను;
బలి కిది ఎఱిగింపుమనచు
బ్రహ్మ నన్ను పంపించెను!

పాల కడలి చిలుకుటకై
పంపించుము నీ వారిని,
మేముకూడ చనుదెంతుము
స్వామికార్య మొనరింతుము!"

అని పలికిన బలిభూపతి
అట్లేయని సమ్మతించె;
పాలవెల్లి మథియింపగ
భటులకెల్ల ఆనతిచ్చె!

రండు రండు దైత్యులార!
రారండని రాజభటులు
తప్పెటలను మ్రోగించిరి,
దండూరా వేయించిరి.

వజ్రదంష్ట్ర, కాలనాభ,
వైరోచన దైతేయులు
గజగజమని భూమి వణక
కదలి వచ్చినారప్పుడు.

వైశ్వానర, వరుణానిల
వసువు, లష్టదిక్పాలురు
దేవతలకు సాయపడగ
దిగ్గన నేతెంచి రపుడు.

పెక్కు వేల దేవ దైత్యు
లొక్క మొగిని మూగినారు;
బలి యానతి పాలవెల్లి
చిలుకుటకై సాగినారు. —(సశేషం)






# సముద్రరాజు అనుగ్రహం

పూర్వం రష్యాదేశంలోని నవగోరద్ నగరంలో సాద్కొ అనే గాయకుడు ఉండేవాడు. నగరంలో ఏ సంపన్నుల ఇంట ఏవిధమైన విందు జరిగినా సాద్కొను పిలిపించి, అతని చేత వీరగాథలు పాడించి విని ఆనందించే వారు. అతనికి ఆవిధంగా మంచి విందు భోజనంతోబాటు కొద్దిగా డబ్బులుకూడా ముట్టుతూ ఉండేవి.

సాద్కొ పేదవాడు, అయినప్పటికీ అతనిని దాదాపు ప్రతిరోజూ ఎవరో ఒకరు ఆహ్వానిస్తూనే ఉండేవారు. కాని ఒకరోజు అతనిని ఎవరూ ఆహ్వానించలేదు అందుచేత ఆరోజు అతనికి భోజనప్రాప్తి లేకపోయింది. ఆరోజు అతను తన తంబురా తీసుకుని నగరానికి దూరంగా ఉండే సరస్సు వద్దకు వెళ్లి, దాని ఒడ్డున కూచుని తన పాటలు పాడసాగాడు.

అతను అలా పాడుతూ ఉండగా సాయంకాలం వేళకు ఒక వింత జరిగింది. సరస్సులో ఏదో కలవరం చెలరేగింది, నీరంతా కెలకబారింది, తాడి ప్రమాణాన అలలు లేవసాగాయి. ఈ ఉపద్రవం చూసి బెదిరిపోయి సాద్కొ అక్కడినుంచి పారిపోయి రాత్రిలోపుగా నగరం చేరుకున్నాడు.

ఆ రాత్రి గడిచింది. మర్నాడుకూడా సాద్కొను ఎవరూ ఆహ్వానించేవారు లేక పోయారు. అందుచేత అతను మళ్ళీ తన తంబురా తీసుకుని సరస్సు ఒడ్డుకు వెళ్ళి కిందటిరోజులాగే పాడసాగాడు. మళ్లీ సాయంకాలం వేళకు సరస్సులో ఉపద్రవం చెలరేగింది. సాద్కొ మళ్లీ భయభ్రాంతుడై పారిపోయి ఇల్లు చేరుకున్నాడు.

మూడోరోజుకూడా సాద్కొను ఎవరూ ఆహ్వానించలేదు. అతను మూడోనాడుకూడా చేసేది లేక సరస్సు ఒడ్డుకు వెళ్లి, తంబురా మీటుతూ తన పాటలు పాడుకున్నాడు. సాయంకాలమయేసరికి ఎప్పటిలాగే సరస్సు

కె. సరస్వతి



కెలకబారటమూ, తాడి ప్రమాణాన కెర టాలు రావటమూ జరిగింది గాని, సాద్కో ఆ కల్లోలాన్ని గమనించలేదు.

అంతలోనే అతని ఎదట ఆకాశం ఎత్తున ఒక ఆకారం వెలిసింది. దాన్ని చూసి సాద్కో కొయ్యబారిపోయాడు.

"నాయనా, నేను సముద్రరాజును. మూడురోజులుగా ఈ సరస్సు అడుగున నేనూ నా అతిథులూ విందు చేసుకుంటు న్నాము. ఈ మూడురోజులూ నీ అద్భుత మైన పాటలు మా అందరికీ ఎంతో ఆనం దాన్ని చేకూర్చాయి. ఇందుకు ప్రత్యుప కారంగా నీకొక సహాయం చేద్దామని ఇలా వచ్చాను. రేపటినుంచీ నీకు యథాప్రకారం గొప్పవాళ్ల ఇళ్లకు పిలుపులు వస్తాయి. రేపే ఒక గొప్ప ఇంట విందు జరుగుతుంది. దానికి నగరంలో ఉండే కోటీశ్వరులూ వర్త కులూ వస్తారు. అందరూ బాగా తిని, తాగి ప్రగల్భాలు పలుకుతారు. అప్పుడు నువు కూడా ఒక విషయం చెప్పు. అదేమిటంటే, ఈ సరస్సులో బంగారు రెక్కల చేప లున్నాయి. ఆ మాట నువు చెప్పావంటే ఎవరూ నమ్మరు. నీమీద పందాలు వేస్తారు. అన్ని పందాలకూ ఒప్పుకో. తరవాత నువు సన్నటి పట్టుదారాలతో అల్లిన చిన్న వల తెచ్చి సరస్సులో వెయ్యి. అందులో బంగారు రెక్కలు గల చేపలు పడేటట్టు నేను చేస్తాను. నువు పందాలు గెలుచుకుని సంపన్నుడివి అవుదువుగాని!" అన్నాడు సముద్రరాజు.

ఆయన అంతర్ధానం కాగానే సాద్కో తన తంబురా తీసుకుని ఇంటికి తిరిగి వచ్చాడు. సముద్రరాజు చెప్పినట్టే మర్నాడు ఒక రాజు గారి ఇంటికి రమ్మని సాద్కోకు ఆహ్వానం వచ్చింది. అక్కడ పెద్ద విందు జరిగింది. దానికి నగరంలో ఉండే కోటీశ్వరులూ, సముద్రవ్యాపారం చేసే వర్తకులూ వచ్చారు. విందు సమయంలో సాద్కో పాటలు పాడాడు. వాటిని విని అందరూ తన్మయు

లయినారు. తరవాత అతిథులు తాగ నారంభించారు. ఒకరిని మించి ఒకరు ప్రగల్భాలు పలకసాగారు. ఒకడు తన వర్తకాన్ని గురించీ, ఒకడు తన భవనాలను గురించీ, ఒకడు తన భార్య అందం గురించీ, ఒకడు తన బలపరాక్రమాలను గురించీ ప్రగల్భాలు పలికారు.

సాద్కొ అందరి మాటలూ వింటూ మౌనంగా ఉండిపోయాడు.

"అందరూ మాట్లాడుతుంటే సాద్కొ మాట్లాడడేం?" అని ఎవరో అడిగారు.

"అయ్యా మీరందరూ గొప్పలు చెప్పుకుంటున్నారు. చెప్పుకోవటానికి మీకు ఏదో ఒకటి ఉన్నది. కాని నేను ఏంగొప్ప చెప్పుకునేది? నాకేమీ లేదు. అయితే మీకెవరికీ తెలియని ఒక రహస్యం నాకు తెలుసును!" అన్నాడు సాద్కొ.

"ఏమిటది? ఏమిటది?" అని అందరూ అడిగారు.

"మన నగరం వెలపల ఉండే సరస్సులో బంగారు రెక్కలు గల చేపలున్నాయి!" అన్నాడు సాద్కొ.

ఈ మాటను ఎవరూ నమ్మలేదు. కొందరు ఆ మాట అబద్ధమన్నారు. సాద్కొ ఈ సంగతి కల్పించాడని మరికొందరు అన్నారు. రోజూ ఎంతోమంది ఆ సరస్సులో వల వేస్తున్నప్ప



టికీ బంగారు రెక్కలు గల చేప ఎన్నడూ ఒక్కటికూడా పడలేదన్నారు మరికొందరు.

"నేను అబద్ధం ఆడలేదు. నిజమే చెప్పాను," అన్నాడు సాద్కో.

"ఆ సరస్సులో బంగారు రెక్కల చేప లున్నట్టు రుజువుచేస్తే నగరంలో నాకు గల దుకాణాలన్నీ ఇచ్చేస్తాను," అన్నా డొక పెద్ద వర్తకుడు.

మిగిలిన వర్తకులంతా పోటీలు పడి ఆమాటే అన్నారు.

"నాకు పందెం ఒడ్డటానికి నా తల తప్ప ఇంకేమీ లేదు. సరస్సులో బంగారు రెక్కలు గల చేపలున్నట్టు రుజువు చెయ్యకపోతే నా తల ఇచ్చేస్తాను," అన్నాడు సాద్కో.

అందరూ ఒప్పుకుని సరస్సువద్దకు బయలుదేరారు. సాద్కో పట్టుదారాలతో అల్లిన ఒక చిన్న వల మాత్రం తీసుకున్నాడు.

తనతో పందెం కట్టిన వర్తకులందరినీ ఒడ్డున నిలబెట్టి సాద్కో నీటిలోకి దిగి వల ముంచి పైకి ఎత్తాడు. అందులో బంగారు రెక్కలు గల చిన్న చేప ఒకటి కొట్టుకుంటూ కనిపించింది.

"ఇందులో ఏదో మోసం ఉన్నది," అన్నారు వర్తకులు.

మోసం ఏమీ లేదని చూపటానికి సాద్కో వలనుంచి ఆ చేపను తీసేసి మళ్లీ వలను నీటిలో వేసి పైకి లాగాడు. అందులో మరొక బంగారు రెక్కల చేప ఉన్నది!

ఈ విధంగా సాద్కో ఎన్నోసార్లు తన వలను సరస్సులో వేసి పైకి తీసి, ప్రతిసారీ ఒక బంగారు రెక్కల చేపను పట్టి వర్తకులకు చూపించాడు.

నగరపు వర్తకులు ఓడిపోయినట్టు ఒప్పుకోక తప్పిందికాదు. వాళ్ళు తమ దుకాణాలన్నిటినీ సాద్కో పరం చేసేశారు. సాద్కో ఆ నగరానికంతకూ మేటి వర్తకుడై, సముద్రవర్తకం చేసి ప్రపంచంలోకెల్లా గొప్ప ధనికుడయాడు.



# కోణార్క సూర్యాలయం

కోణార్క (ఒరిస్సా రాష్ట్రం) వద్ద గల సూర్యాలయం మన దేశపు అద్భుతాలలో ఒకటి. ఈ ఆలయం పూరిక్షేత్రానికి ఈశాన్యంగా 53 మైళ్ల దూరంలో ఉన్నది. పూరినుంచి ఇక్కడికి రహదారి ఉన్నది. భువనేశ్వరం నుంచి కూడా ఇక్కడికి రావచ్చు. ఈ దారి 40 మైళ్లు మాత్రమే.

పూరీ జగన్నాథస్వామి ఆలయాన్ని తెల్ల ఆలయమనీ, కోణార్క సూర్యాలయాన్ని నల్ల ఆలయమనీ అంటారు. ఈ ఆలయాన్ని క్రీ. శ. 1238-1264 మధ్య ఓఢ్రరాజు మొదటి నరసింహదేవుడు నిర్మింప జేశాడు. ఈ ఆలయం ఒకప్పుడు బ్రహ్మాండమైన ప్రమాణం కలిగినదై ఉండాలి. ఎందుకంటే ఆలయమంతా శిథిలమై పోగా ఈనాడు మిగిలి ఉన్న ముఖభాగమే ఎంతో పెద్దదిగా ఉండి, చుట్టు పక్కల ఎంతో దూరానికి కానవస్తున్నది.

ఈ ఆలయం మీద సహజ ప్రమాణం గల సింహాలూ, ఏనుగులూ, అనేక ప్రతిమలూ అద్భుతంగా చెక్కి ఉన్నాయి. హిందూ ఆలయాలు వేటిలోనూ ఇలాటి ప్రతిభ గల కళా, శిల్పమూ, వాస్తువైచిత్రీ కనిపించదని ప్రవీణులు భావిస్తున్నారు.






# పునర్వివాహం

పట్టు విడవని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, వాగ్దానం నిలబెట్టుకోవటంలో నీ కున్నంత దీక్ష అందరికీ ధర్మాచరణలో ఉంటే ఎంత బాగుండును. ఉదయసేనుడి కుమార్తె అయిన సుజాత వంటి శీలవతికూడా పునర్వివాహం చేసుకున్నదిగద. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకామె కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పసాగాడు:

పూర్వం వజ్రశిలానగరంలో ఉదయసేనుడనే కులీన క్షత్రియుడుండేవాడు. ఆయనకు సుజాత అని ఒక కుమార్తె ఉండేది. ఆమెకు యుక్తవయసు రాగా ఉదయసేనుడు సంబంధాలు విచారిస్తూ ఒక్కటీ నచ్చక తలకిందులై పోసాగాడు. కాని సుజాతను పురందరుడనే ఒక

## బేతాళ కథలు




సామాన్య క్షత్రియ యువకుడు ప్రేమించి పెళ్లాడగోరాడు. అతను ముందుగా ఉదయసేనుడితో మాట్లాడి ఆయనకు తన కోరిక తెలియజేశాడు. అయితే అతనికి తన కుమార్తె నివ్వటానికి ఉదయసేనుడు సుతరామూ సమ్మతించలేదు. "మీ వంశమేమిటి? నీ హోదా ఏమిటి? నా కుమార్తెను ఏ రాజకుమారుడో, ఏ మహా వీరుడైన సేనాధిపతో చేసుకోవలిసిందే తప్ప నీలాటి అనామకుడు పెళ్ళాడటం ఎన్నటికీ జరగదు!" అన్నాడాయన పురందరుడితో.

పురందరుడు అంతటితో హతాశుడై పోక సుజాతకు ఆమె దాసిద్వారా తన కోరిక తెలియజేశాడు. పేరుప్రతిష్ఠలు గల భర్తను చేసుకోవటంకంటె తనను నిజంగా ప్రేమించినవాణ్ణే చేసుకోవటం సుజాతకు ఉచితమనిపించింది. తాను పురందరుణ్ణి బహిరంగంగా పెళ్ళాడటానికి తండ్రి ఒప్పుకోడు గనక రహస్యంగా ఇంటి నుంచి వెళ్ళిపోయి పురందరుడికి భార్య అయిపోవటానికి ఆమె సంసిద్ధురాలయింది.

ఈ సంగతి తెలియగానే పురందరుడు పరమానందం చెంది, తమ వివాహానికి ముహూర్తం పెట్టించి, వజ్రశిలానగరానికి మూడుకోసుల దూరాన నట్టడవిలో ఉన్న కాళికాలయం అవరణలో పెళ్ళి జరిగేటందుకు ఏర్పాట్లు చేసి వివరాలన్నీ సుజాతకు తెలిపాడు.

పురందరుడు పెళ్ళి ప్రయత్నాలు చెయ్యటానికి మరొక గ్రామం వెళ్ళాడు. పెళ్లిరోజు సాయంకాలమే అతను పురోహితుణ్ణీ, ఒక ముత్తయిదువునూ, బోయీలతో ఒక మేనానూ కాళికాలయానికి పంపాడు. ఆ గ్రామానికి కాళికాలయం ఆరు కోసుల దూరం ఉన్నది. అతను జాము పొద్దుపోయి తన గుర్రంమీద కాళికాలయానికి బయలుదేరాడు. ముహూర్తం అర్ధరాత్రి దాటి నాలుగు గడియలకు.



61




ఆ రాత్రి సుజాత మామూలుగానే భోజనంచేసి వెళ్ళి పడుకున్నది. ఆమె దీపం ఆర్పేసింది కాని నిద్రపోలేదు. త్వరలోనే ఆమె దాసి కిటికీ వద్దకు వచ్చి, "అమ్మా, గుర్రం సిద్ధంగా ఉన్నది. అందరూ నిద్ర పోతున్నారు!" అన్నది. సుజాత బయటికి వెళ్ళింది. ఆమే, దాసీ కలిసి గుర్రం ఎక్కి కాళికాలయానికి బయలుదేరారు. వారు కాళికాలయానికి చేరబోయే సమయానికి పెద్ద హోరుగాలి సాగింది. దానితోబాటు వానకూడా ఆరంభమయింది.

ఈ తుఫాను ఆరంభమయే సమయానికి పురందరుడు అప్పుడే అరణ్యంలోకి ప్రవేశించాడు. గాలికి చెట్లు విరిగి పడి దారులన్నీ మూసుకుపోయాయి. లేని దారులు చేసుకుంటూ అతను తన గుర్రాన్ని ముందుకు నడిపించాడు. అంతకంతకూ తుఫాను ఉధృతం హెచ్చి ప్రయాణం అసంభవమవుతున్నది. అతను ఆ అడవిలో అలా పడి దిక్కు తెలియకుండా ఎంతసేపు తిరిగాడో తెలియదు. గుర్రం అలిసిపోయింది. చేసిన ప్రయత్నమంతా వృథా అయిపోతున్నదనే బెంగతో అతనుకూడా మానసికంగా నీరసించిపోయాడు.

కొంతసేపటికి తుఫాను తగ్గిపోయింది. తూర్పు తెల్లవారసాగింది. ఆ మసక వెలుగులో అరణ్యమంతా భీభత్సంగా ఉంది. అతను సూర్యోదయంవేళకు ఎలాగో కాళికాలయం చేరుకున్నాడు. కాని అక్కడ ఎవరూ లేరు!

అయితే ఆ రాత్రి కాళికాలయంలో సుజాతకు మాత్రం పెళ్లి అయిపోయింది. పెళ్ళిముహూర్తం మించిపోతున్నదని అందరూ ఆందోళనపడుతూండే సమయంలో అక్కడికొక యువకుడు వానదెబ్బ తిని గుర్రంపైన వచ్చాడు. "పెళ్ళికొడుకు వచ్చాడు! వచ్చాడు!" అన్నారు. ఆరుతూ వెలుగుతూ ఉన్న గుడ్డి దివిటీ వెలుతురులో

పురోహితుడు వారిద్దరికీ పెళ్లి చేసేశాడు. పెళ్లికొడుకు తన మెడలో పుస్తె కట్టబోతున్న సమయంలో సుజాత తల ఎత్తి చూసి, "ఈయనకాదు!" అన్నది. మరుక్షణం ఆమె స్పృహతప్పి పడిపోయింది.

తెల్లవారేలోపుగా సుజాతను దాసీది ఎలాగో ఇల్లు చేర్చింది. అదిమొదలు రెండు వారాలపాటు ఆమె తీవ్రమైన జ్వరంతో తీసుకున్నది. ఆమె విషయం విచారించి పోవటానికి వచ్చిన పురందరుడు ఆమె దాసితోకూడా మాట్లాడలేకపోయాడు. పెళ్ళి కొడుకు ఏమైపోయాడో ఎవరికీ తెలియదు.



ఇంతలో ఆ రాజ్యానికీ పరిసర రాజ్యానికీ మధ్య యుద్ధం వచ్చింది. పురందరుడు ఆ యుద్ధంలో పాల్గొనబోయాడు. అందులోనే అతను చనిపోయాడు.

సుజాత వ్యాధి నుంచి కోలుకున్నదిగాని వెనకటి మనిషిమటుకు కాలేదు. ఆమె హృదయం మనోవ్యధతో బరువెక్కి పోయింది. తరవాత కొంతకాలానికి ఆమె తండ్రి అయిన ఉదయసేనుడుకూడా మరణించాడు. ఆయన యావదాస్తికీ ఆమె వారసురాలయింది.

ఎందరో గొప్పగొప్పవాళ్ళు ఆమెను పెళ్లాడతామని వచ్చారు. ఆమె ఆ విషయం మాట్లాడటానికి కూడా నిరాకరించింది. ఆమె హితం కోరినవారందరూ, "ఇలా ఎంత కాలం కన్నెచెరలో ఉంటావు?" అని అడిగారు. "నాకు తెలియదు!" అని ఆమె సమాధానం చెప్పింది.

ఇంతలో ఆ నగరానికి ఒక క్షత్రియ యువకుడు వచ్చాడు. అతనిపేరు మిళిందుడు. అతనుకూడా యుద్ధంలో గొప్ప పరాక్రమం చూపించిఉండటంచేత రాజుగారి దగ్గిర మంచి ఉద్యోగం దొరికింది. ఈ మిళిందుడు సుజాతగురించి విన్నాడు, తరవాత ఆమెను పరిచయం చేసుకున్నాడు. ఆమె విషాదగాథ విని అతను మొదట జాలి

చెందాడు. ఎంతో చక్కనిదీ, బుద్ధిమంతురాలూనూ! సామాన్య యువకుణ్ణి ప్రేమించింది! అతన్ని పెళ్ళాడటానికి తండ్రి ఒప్పలేదు! తరవాత ఆ యువకుడు కాస్తా యుద్ధంలో మరణించాడు! అంతకంటె ఆమె మనసు విరచటానికి ఇంకేంకావాలి?

మిళిందుడి జాలి క్రమంగా ప్రేమగా మారింది. అతను ఒకనాడు సుజాతతో, "జరిగినదాన్ని గురించి ఎంతకాలం దిగులు పడతావు, సుజాతా? నేను నిన్ను ప్రేమిస్తున్నాను. చచ్చిపోయిన పురందరుణ్ణి మరిచిపోయి నన్ను పెళ్ళాడినట్టయితే నీకు ఏ లోటూ లేకుండా అన్ని సౌఖ్యాలూ ఒనగూర్చుతాను!" అన్నాడు.

"నేను పురందరుణ్ణి మరిచిపోయి చాలా కాలమయింది. మీకు నామీద నిజంగానే ప్రేమ ఉన్నపక్షంలో తప్పక పెళ్ళాడతాను," అన్నది. వారిద్దరికీ వైభవంగా వివాహం జరిగింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, సుజాత చేసిన పని ధర్మబాహ్యంగా లేదా? ఆమె ఒకణ్ణి ప్రేమించింది. అతను పోయాడు. దైవికంగా ఇంకొకణ్ణి పెళ్ళాడింది. అతను ఏమైనాడో ఎవరికీ తెలియదు. అటువంటి పరిస్థితిలో సుజాత శీలవతి అయితే మిళిందుణ్ణి పెళ్ళాడుతుందా? ఆమె అలా చెయ్యటానికి కారణమేమిటి? దీనికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

"సుజాత ఆ రాత్రి కాళికాలయంలో దైవికంగా పెళ్ళాడినది ఈ మిళిందుణ్ణే అయి ఉండాలి! లేకపోతే ఎవరితోనూ తన పెళ్ళి గురించి చర్చించని మనిషి ఇతణ్ణి పెళ్ళాడటానికి ఒప్పదు!" అన్నాడు విక్రమార్కుడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)






రాత్రి భోజనాలు కాగానే తాతయ్య చల్ల గాలికి అరుబయట పడకకుర్చీ వేసుకుని పౌర్ణమి చంద్రుణ్ణి చూస్తూ కూచున్నాడు. పిల్లలు చాపలు వేసుకుని ఆయన చుట్టూ కూచున్నారు.

ఉన్నట్టుండి తాతయ్య ఒక శ్లోకం చదివాడు:

> "భాగ్యం ఫలతి సర్వత్ర;
> నవిద్యా నచ పౌరుషమ్—
> కూష్మాండాభ్యంతరే ముక్తా
> స్తురుష్కేణ విలోకితః"

"అంటే ఏమిటి, తాతయ్యా?" అని పిల్లలు ఒక్కసారిగా అడిగారు.

తాతయ్య రొండినుంచి తాపీగా పొడుం కాయ తీసి, ఒక్క చిటికెడు పొడుం చేతిలో వేసుకుని, దాన్ని పట్టుపట్టి పీల్చి, "ఆ శ్లోకానికి అర్థమేమిటనా అడుగుతున్నారు? చెబుతా వినండి: ఎక్కడనైనా అదృష్టమే ఫలిస్తుందిసుమా! కేవలమూ విద్య ఉన్నంత మాత్రానా, పౌరుషం ఉన్నంత మాత్రానా, చాలదు. గుమ్మడికాయలో ఉన్న ముత్యాలు తురకవాడికిగదా కనిపించాయీ అని!" అన్నాడు.

"గుమ్మడికాయలో ముత్యాలేమిటి, తాతయ్యా?...తురకవాడెవరు తాతయ్యా?... ఆ కథ ఏమిటో చెప్పవు, తాతయ్యా?" అంటూ పిల్లలు తలా ఒక ప్రశ్న వేశారు.

"కథ చెప్పమనా అడుగుతున్నారు? అయితే వినండి," అన్నాడు తాతయ్య....

అనగనగా వ్యాఘ్రపురమని ఒక ఊరు. దాన్ని విష్ణుగుప్తుడనే రాజు పాలించేవాడు. ఈయన చిత్రమైన మనిషి. పెద్దలు చెప్పే మాటలు నిజమో, కావో అని మధ్య మధ్య పరీక్షకు పెట్టేవాడు. ఒకరాత్రి ఆ రాజు నిద్ర పట్టక ఏదో ఆలోచిస్తూ ఉండగా ఒక శ్లోకం జ్ఞాపకంవచ్చింది. అదేమిటంటే:

తాతయ్య కథలు:—**1** రచన: సి. శేషాద్రి

"హరిణాపి, హరేణాపి,
బ్రహ్మణాపి, సురైరపి,
లలాట లిఖితా రేఖా
పరిమార్ష్టుం నశక్యతే"

దాని అర్థమేమిటంటే: బ్రహ్మ విష్ణు మహేశ్వరులయేది, దేవతలయేది నొసట వ్రాసినదాన్ని తప్పించటం ఎవరికీ సాధ్యం కాదూ అని.

ఇది నిజమా, కాదా తేల్చుకోవాలని ఆ రాజు ఏంచేశాడంటే ఒక గుమ్మడికాయ సంపాదించి, దాని లోపల గుజ్జు ఉపాయంగా తీసేసి దానినిండా ముత్యాలు నించాడు.

మర్నాడు తెల్లవారుతూనే ఆయన వద్దకు ఒక బ్రాహ్మడు రాగా ఆయనకు రాజు ఆ గుమ్మడికాయ దానం చేశాడు. అదే సమయానికి ఒక తురకవాడు రాజుగారి దర్శనం చేసుకోవచ్చాడు. రాజుగారు ఆ తురకవాడి చేతిలో ఒక పావలా పెట్టాడు.

ఆ బ్రాహ్మడూ, తురకవాడూ ఒకే దారిన నడవసాగారు. అప్పుడు బ్రాహ్మడు ఏమనుకున్నాడంటే, "ఈ గుమ్మడికాయ నాకెందుకు? పట్టి మోతచేటు! ఇంటిలో బోలెడన్ని గుమ్మడికాయలు ఉండెగదా!" అని. ఇలా అనుకుని తురకవాడితో, "సాయిబూ, కావలిస్తే నీ దగ్గరఉన్న పావలా ఇచ్చి ఈ గుమ్మడికాయ నువు పుచ్చుకో!" అన్నాడు.

తురకవాడు సరేనని తన పావలా బ్రాహ్మడికిచ్చి ఆ గుమ్మడికాయ పుచ్చుకున్నాడు. అతడు ఇంటికి పోయి గుమ్మడికాయను తరిగి చూస్తే, ఇంకేముందీ? దానినిండా ముత్యాలు! తురకవాడు రాజుగారి వద్దకు వెళ్లి జరిగినదంతా చెప్పాడు.

"నీ అదృష్టం బాగుంది! ఆ ముత్యాలు నీవే ఉంచుకో!" అన్నాడు రాజు.

"చూశారా? అదృష్టం కలిసిరావాలి!" అన్నాడు తాతయ్య.



స్థల పురాణం:

# 2. తఱికొండ (చిత్తూరు జిల్లా)

రాయలసీమలోని రాయదుర్గమునకు సమీపములో గలదు. ఈ గ్రామమును గురించి ప్రజలొక గాధను చెప్పుకొందురు:

పూర్వమొక పర్యాయము రాయదుర్గమందు కాటకము సంభవించెను. ప్రజలందరు యొకచోట చేరి జలము, ఆహారము దొరుకునట్టి మరియొక చోటికి తరలిపోవ తీర్మానించుకొనిరి. ఆ మరుదినముననే గ్రామస్థులందరు గృహములను వదలి తమ తమ పశువులనెల్ల దోలుకొని కుటుంబములతో బయలుదేరిరి. వారట్లు పగలంతయు పయనించి ప్రత్తిమిట్ట యను స్థలమునకు చేరిరి. దూరమునుండి నడిచివచ్చిన అలసటచేత ఆ రాత్రి వారందరు అచటనే, తమ వెంట దెచ్చుకొనిన ఆహారపదార్థముల భుజించి నిద్రించిరి. నిద్రపోయేముందు కొందఱు తమ బాధలు తీర్చమని నృసింహుని ప్రార్థించిరి. తెల్లవారు ఝామున వారిలో లక్ష్మినరసాంబ యను కాంత తన వాడుకచొప్పున మజ్జిగ చిలుకుచుండెనట. ఆమెకు కుండలో యొక రాయి తగిలెను. ఆమె మజ్జిగ చేయుట ఆపి, కుండలో రాయిని తీయుటకు చేయిబెట్టి వెతుకగా నేమియు కన్పించలేదు. మరల మజ్జిగ చేయ మొదలిడగా మరల శిల తగిలెను. కాని వెతికి చూడగా నేమియు కాన్పించలేదు. ఆమె విస్మయముతో తన భర్తను లేపి చూపించగా, అతడును అచ్చెరువు చెంది తోడి వారలనందరిని లేపి చూపించగా, వారందరు విస్మితులైరి. ఆ మాయ నెరుగజాలక అందరు నృసింహస్వామిని వేడుకొనిరట. అపుడు వారికి మింటనుండి, "మీ కష్టములు గట్టెక్కించుటకీ తఱికుండలో బుట్టితిని. యిచట తిప్పపై నా కాలయము నిర్మింపుడు. ఈ గ్రామములోనే మీరు నిలిచి గృహములు నిర్మించుకొని దీనిని తఱికుండ యని పిలువుడు," అను మాటలు వినపడెనట. కొంతసేపటికా తఱికుండయందు చూడగా నృసింహస్వామి విగ్రహము కనపడెనట. అప్పుడు వారచట ఒక దేవాలయమును నిర్మించి, అందా విగ్రహమును ప్రతిష్ఠించిరట. కొంతకాలమునకు ఉచ్చారణ వేగములో తఱికుండ "తఱికొండ"గా మారెనట.

—సూర్యదేవర సూర్యనారాయణ






పూర్వం చీనాదేశంలో ఒక మహావీరుడుండేవాడు. అతను సమస్త అస్త్రాలలోనూ ఎంతో నిపుణుడు. అందుచేత అతను బలహీనులను బలవంతులైన దుర్మార్గుల బారినుండి రక్షిస్తూండేవాడు.

ఒకనాడీ వీరయోధుడు తన ఖడ్గాన్నీ, ధనుర్బాణాలనూ పట్టుకుని తన గుర్రాన్ని ఎక్కి రాజధాని నగరానికి బయలుదేరి పగలంతా ప్రయాణంచేసి రాత్రికి మజిలీ స్థలాలలో నిలుస్తూ కొన్నాళ్లు ప్రయాణించినాక, ఒకనాడు దారి తప్పటం జరిగింది. చీకటి పడబోతున్నదిగాని మజిలీస్థలం కనిపించలేదు. అందుచేత మన యోధుడు ఒక గ్రామం చేరి ఆ రాత్రి అక్కడ ఉండిపోదామనుకున్నాడు.

ఆ గ్రామంలో ఒక ఇంటి ప్రాకార ద్వారం తెరిచి ఉన్నది. లోపల ఇంట్లోనుంచి దీపం వెలుగు కనిపిస్తున్నది. అందుచేత మన యోధుడు ఆ ఇంటిముందు గుర్రం ఆపి, దిగి, దాన్ని నడిపించుకుంటూ ఇంటిముందున్న ఆవరణలోకి ప్రవేశించాడు. ఆ ఆవరణలో మూడు పెద్ద కొండరాళ్ళు తప్ప ఇంకేమీ లేవు. ఆవరణ అవతల వరసగా మూడు గదులూ, వాటికి రెండుపక్కలా చెరొక గదీ ఉన్నాయి. ఒక వృద్ధురాలు ఇంటిమధ్య కూచుని వడుకుతున్నది. గుర్రపుడెక్కల చప్పుడు వింటూనే ఆమె లేచి వచ్చి మన యోధుణ్ణి ఏంపని అని అడిగింది.

"అమ్మా, నేను దారితప్పాను. ఈ రాత్రి పడుకునేటందుకు కాస్త చోటు ఇప్పించగలరా? తెల్లవారగానే లేచి నాదారిన పోతాను," అన్నాడు యోధుడు.

"చోటు ఇవ్వటమూ, ఇవ్వకపోవటమూ నా చేతిలో లేదు, నాయనా!" అన్నది వృద్ధురాలు విచారంగా.

చీనా జానపద కథ

"ఇంటికైన మగవాళ్ళు ఏరీ? మీరు ఒంటరిగా ఉన్నారేం?" అని యోధుడు ఆమెను అడిగాడు.

"నేను విధవరాలిని, నాయనా. నాకున్న ఒక్క కొడుకూ వ్యాపారంమీద తిరుగుతూ ఉంటాడు," అన్నది వృద్ధురాలు.

"మరి మీ కోడలు ఏదీ?" అన్నాడు యోధుడు.

"ఎందుకు అడుగుతావు, నాయనా. అది పొరపాటున ఆడపుటక పుట్టిందిగాని, దానికి ఎంతలేసి మగవాళ్ళూ సమంకారు. మనిషి జమాజెట్టీలాగుంటుంది, వట్టి కోపిష్టి ది. అయినదానికీ కానిదానికీ మండిపడుతుంది. తలుచుకుంటే అది నన్ను చిటికెనవేలుతో చంపెయ్యగలదు. అందుకని ఎంతో అణిగి మణిగి అతి జాగ్రత్తగా ఉంటాను. అయినా అది నన్ను అడుగడుగునా కసురుతూనే ఉంటుంది. అందుకే నేను నీ కోరిక తీర్చ లేని స్థితిలో ఉన్నానని చెప్పాను, నాయనా!" అన్నది వృద్ధురాలు, తన కన్నీరు పైట చెంగుతో తుడుచుకుంటూ.

ఇదంతా వినేసరికి యోధుడికి మండి పోయింది.

"ఎంత విడ్డూరం! ఎంత అన్యాయం! ఈ గయ్యాళి మనిషి ఎక్కడ? నీకు ఆ



మనిషి పీడ లేకుండా విరగడ చేసేస్తాను," అన్నాడు యోధుడు.

అనాథ అయిన ఈ వృద్ధురాలిని రక్షించ టానికి అతనికి మంచి అవకాశం దొరికింది. అతను తన గుర్రాన్ని ఒక బండరాయికి కట్టేసి కత్తిదూసి నిలబడ్డాడు.

"ఊరుకో, నాయనా! ఇది నీకు సాధ్య మయే పనికాదు. మా కోడలి సంగతి నువ్వెరగవు. దానికి ఆడపనులేవీ చేతగావు, కానీ రోజూ అది అడివికి వెళ్ళి కర్రపుల్ల కూడా సాయం లేకుండా ఏదో ఒక జంతు వును ఉత్త చేతులతో చంపి తెస్తుంది. వాటిని అమ్మగా వచ్చిన డబ్బుతో మేము

కాలక్షేపం చెయ్యగలుగుతున్నాము. అందుకే నేను దానికి కోపం తెప్పించటానికి వెరుస్తాను," అన్నది వృద్ధురాలు.

వృద్ధురాలు ఈ మాట అనగానే మన యోధుడు కత్తిని మళ్ళీ ఒరలో పెట్టేశాడు.

"నా జీవితమంతా అనాథలను దుర్మార్గుల బారినుంచి రక్షించటానికి కంకణం కట్టుకున్నాను. నీ కోడలుపైన నీ బతుకు ఆధారపడి ఉందంటున్నావు గనక నేనామెను చంపను! మెత్తగా తన్ని బుద్ధి వచ్చేలాగ చేస్తాను!" అన్నాడు మన యోధుడు.

మరికొంచెంసేపటిలో కోడలు రానే వచ్చింది. ఆమె తన వీపుపైనుంచి ఒక పెద్ద పులిని ఆవరణలో పడేసి, "ముసలిదానా, దీపం తెచ్చి, దీన్ని లోపలికి తీసుకుపో!" అని కేకపెట్టింది.

ముసలిది దీపం తెచ్చి దాని వెలుతురులో పులిని చూసి బెదిరింది. మన యోధుడి గుండెకూడా ఆ చచ్చిన పులి కనబడగానే చప్పున చల్లబడింది.

"ఆ గుర్రం ఎక్కణ్ణుంచి వచ్చింది?" అని కోడలు అత్తను అడిగింది.

మన యోధుడు ముందుకు వచ్చి, "ఆ గుర్రం నాదేనండి. నేను రాజధానికి ప్రయాణమై పోతూ, దారి తప్పానండి. మీ గ్రామం చేరేసరికి చీకటి పడిందండి.

